సంవత్సరచందా
రు. 12-0-0
విడిపత్రిక
4 అణాలు

# ప్రతి బుధవారము
ప్రకటింపబడును

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **42**
**4-7-51**

ఖర సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్య బుధవారము


# కొరియా శాంతిసన్నాహాలు

[సీతారామ్]

కొరియాలో యుద్ధం ప్రారంభమై సంవత్సరం దాటింది. రెండుపక్షాలా సైనికనష్టాలు కాక కొన్ని లక్షలమంది నిరాయుధులైన ప్రజలు మారణహోమంలో నశించారు. ఒకసారి ఒక్క రాత్రిలో నూటయేభై గ్రామాలు అమెరికన్ బాంబర్లకు గురై రూపుమాసిపోయినాయంటే, ఈ యుద్ధంలో ఎంత ప్రాణనష్టం, ఆస్తినష్టం సంభవించి ఉంటుందో ఊహించుకోవచ్చు. మున్ముందు యుద్ధాలు సంభవిస్తే మానవకోటికి ఎంతటి ఉపద్రవం సంభవించగలదో ఊహించాలంటే కొరియాయుద్ధాన్ని గమనిస్తే కూడాచాలదు. ఈ యుద్ధంలో ఇంకా కమ్యూనిస్టుదేశాల విమానబలం, అమెరికా రష్యాల ఏటంబాంబులు ప్రయోగించబడలేదు. రష్యా అమెరికాల మధ్య యుద్ధమే సంభవిస్తే విషవాయువు, అంటువ్యాధుల వ్యాప్తి మొదలైన దుష్టపరికరాలు ప్రయోగించకమానరు. దానితో కొరియాయుద్ధాన్ని పోల్చడానికే వీలుండదు. అయినప్పటికీ రెండో ప్రపంచయుద్ధంలో ఏ దేశమూ, ఈ యుద్ధంలో కొరియా దేశమంతగా క్షోభ ననుభవించలేదు. జపాన్ పై ఏటంబాంబు ప్రయోగాలవల్ల మినహా ఇంతవరకు ఏ యుద్ధంలోనూ ఇంత రక్తపాతం సంభవించలేదు. యుద్ధంతో నిమిత్తంలేని ప్రజ లింత ఘోరయాతనల ననుభవించలేదు. కొరియాదేశమంతా ఈనాడు శ్మశానవాటికవలె ఉందని చెప్పవచ్చును. ఇటువంటి యుద్ధంలో ఈనాడు ప్రతిష్టంభన ఏర్పడింది.

ఉభయపక్షాలూ అనేకమార్లు 38 వ అక్షాంశమనబడే సరిహద్దును అటూ ఇటూ దాటాయి. చివరికి కమ్యూనిస్టుల పక్షాన అంగబలం, సమితిసేనల పక్షాన ఆయుధబలం సరితూగినాయి. ఉభయపక్షాలలో ఎవరికీ జయంకాని, పరాజయంకాని లభించలేదు. 38 వ అక్షాంశంవద్ద యుద్ధం సాగుతూనే ఉంది. ఎవరూ ముందంజ వేయలేని స్థితి వచ్చింది.

భారతదేశం హెచ్చరికను మన్నించకుండా ఉత్తరకొరియాను ఆక్రమించుకోడానికి జనరల్ మెకార్థర్ చేసిన యత్నం, చీనాకమ్యూనిస్టు వాలంటీర్ల జోక్యంవల్ల విఫలమైపోయిన తరవాతగాని, సమితిసేనలు ఉత్తరకొరియాను ఆక్రమించుకోడం అనవసరమనే భావం అమెరికన్లకు తోచలేదు. చీనా కమ్యూనిస్టులు సమితిసేనలను దక్షిణకొరియన్ రిపబ్లిక్ రాజధానీ నగరమైన సోల్ నగరానికి దక్షిణంగా తరిమివేసి తిరిగి వెనక్కు వెళ్లిపోయారు. అమెరికన్ విమానాలు వందలు, వేలుగావచ్చి సైనిక స్థావరాలు, జనావాసాలు అనే విచక్షణలేకుండా బాంబులవర్షం కురిపించి దేశాన్ని నేలమట్టంచేసి విడిచిపెట్టారు; కాని కమ్యూనిస్టుల విమానాలు యుద్ధరంగాన్ని దాటి దక్షిణంగా వెళ్లలేదు; జనావాసాలపైన బాంబులు వెయ్యలేదని సమితిసేనల అధికారులే చెప్పారు. కమ్యూనిస్టుల సప్లయి కేంద్రాలకు అమెరికన్ విమానాలవల్ల ముప్పు కలుగుతుందన్నప్పుడు మాత్రం కమ్యూనిస్టుల విమానాలువచ్చి అమెరికన్ విమానాలతో పోరాడాయి. కొరియాలో యుద్ధం ఈ రీతిగా ఆరుమాసాలనుంచి సాగింది. చివరికి చీనాకమ్యూనిస్టు లున్నంతకాలం సమితిసేనలు ఉత్తరకొరియన్ కమ్యూనిస్టులను జయించలేరనీ, కమ్యూనిస్టుల విమానబలం ప్రయోగించబడిందంటే సమితిసేనలు తిరిగి వెనక్కు తగ్గక తప్పదనీ తెలిసింది. చీనాకమ్యూనిస్టులు అదనపు సేనలను పంపినా కొరియానుంచి సమితిసేనలకు మళ్లీ ముప్పు సంభవించవచ్చును. ఇటు సమితిసేనలు కూడా వృద్ధిపరచబడినా సైనిక ప్రతిష్టంభన మారదనీ, దీర్ఘయుద్ధం జరిగినా జయాపజయాలు నిర్ధారణకావడం అసంభవమనీ స్పష్టపడింది.

## రష్యా శాంతి దౌత్యం

ఇట్టి పరిస్థితిలో 38 వ అక్షాంశరేఖ తిరిగి సరిహద్దుగా యుద్ధాన్ని విరమించడానికి సిద్ధంగా ఉన్నట్లు అమెరికన్ విదేశాంగ మంత్రి డీన్ఎచిసన్ జూన్ 2 వ తేదీని ప్రకటించాడు.

ఎచిసన్ ఈవిధంగా ప్రకటించడానికి ముందు కొన్ని వదంతులు ప్రచారమైనాయి. ఫార్మోజా సమస్యగాని, ఐక్యరాజ్యసమితిలో పెకింగ్ ప్రభుత్వ సభ్యత్వ సమస్యగాని, రాజకీయరీత్యా పరిష్కారం కావని అన్ని దేశాలకూ స్పష్టపడింది.




సంవత్సర చందా రు. 12-0-0 విడిప్రతిక 4 అణాలు

ప్రతి బుధవారము ప్రకటింపబడును

Founder : K. NAGESWARA RAO

సంపుటము 43 సంచిక 42 4-7-51

ఖర సంవత్సర జ్యేష్ఠ బహుళ అమావాస్య బుధవారము


# కొరియా శాంతిసన్నాహాలు

[సీతారామ్]

కొరియాలో యుద్ధం ప్రారంభమై సంవత్సరం దాటింది. రెండుపక్షాలా సైనికనష్టాలు కాక కొన్ని లక్షలకుంది నిరాయుధులైన ప్రజలు మారణహోమంలో వశించారు ఒకసారి ఒక్క రాత్రిలో కూటయేభై గ్రామాలు అమెరికన్ బాంబర్లకు గురై రూపుమాసిపోయినాయంటే, ఈ యుద్ధంలో ఎంత ప్రాణనష్టం, ఆస్తినష్టం సంభవించి ఉంటుందో ఊహించుకోవచ్చు. మున్ముందు యుద్ధాలు సంభవిస్తే మానవకోటికి ఎంతటి ఉపద్రవం సంభవించగలదో ఊహించాలంటే కొరియాయుద్ధాన్ని గమనిస్తే కూడాచాలదు. ఈ యుద్ధంలో ఇంకా కమ్యూనిస్టుదేశాల విమానబలం, అమెరికా రష్యాల ఏటంబాంబులు ప్రయోగించబడలేదు. రష్యా అమెరికాల మధ్య యుద్ధమే సంభవిస్తే విషవాయువు, అంటువ్యాధుల వ్యాప్తి మొదలైన దుష్టపరికరాలు ప్రయోగించకమానరు. దానితో కొరియాయుద్ధాన్ని పోల్చడానికే వీలుండదు. అయినప్పటికీ రెండో ప్రపంచయుద్ధంలో ఏ దేశమూ, ఈ యుద్ధంలో కొరియా దేశమంతగా క్షోభ ననుభవించలేదు. జపాన్ పై ఏటంబాంబు ప్రయోగాలవల్ల మినహా ఇంతవరకు ఏ యుద్ధంలోనూ ఇంత రక్తపాతం సంభవించలేదు. యుద్ధంతో నిమిత్తంలేని ప్రజ లింత ఘోరయాతనల ననుభవించలేదు. కొరియా దేశమంతా ఈనాడు శ్మశానవాటికవలె ఉందని చెప్పవచ్చును. ఇటువంటి యుద్ధంలో ఈనాడు ప్రతిష్టంభన ఏర్పడింది.

ఉభయపక్షాలూ అనేకమార్లు 38 వ అంక్షాశమనబడే సరిహద్దును అటూ ఇటూ దాటాయి. చివరికి కమ్యూనిస్టుల పక్షాన అంగబలం, సమితిసేనల పక్షాన ఆయుధబలం సరితూగినాయి ఉభయపక్షాలలో ఎవరికీ జయంకాని, పరాజయం కాని లభించలేదు. 38 వ అక్షాంశంవద్ద యుద్ధం సాగుతూనే ఉంది. ఎవరూ ముందంజ వేయలేని స్థితి వచ్చింది

భారతదేశం హెచ్చరికను మన్నించకుండా ఉత్తరకొరియాను ఆక్రమించుకోడానికి జనరల్ మెకార్థర్ చేసిన యత్నం, చీనాకమ్యూనిస్టు వాలంటీర్ల జోక్యంవల్ల విఫలమైపోయిన తరవాతగాని, సమితిసేనలు ఉత్తరకొరియాను ఆక్రమించుకోడం అనవసరమనే భావం అమెరికన్లకు తోచలేదు. చీనా కమ్యూనిస్టులు సమితిసేనలను దక్షిణకొరియన్ రిపబ్లిక్ రాజధానీ నగరమైన సోల్ నగరానికి దక్షిణంగా తరిమివేసి తిరిగి వెనక్కు వెళ్లిపోయారు అమెరికన్ విమానాలు వందలు, వేలుగావచ్చి సైనిక స్థావరాలు, జనావాసాలు అనే విచక్షణలేకుండా బాంబులవర్షం కురిపించి దేశాన్ని నేలమట్టంచేసి విడిచిపెట్టారు; కాని కమ్యూనిస్టుల విమానాలు యుద్ధరంగాన్ని దాటి దక్షిణంగా వెళ్లలేదు; జనావాసాలపైన బాంబులు వెయ్యలేదని సమితిసేనల అధికారులే చెప్పారు. కమ్యూనిస్టుల సప్లయి కేంద్రాలకు అమెరికన్ విమానాలవల్ల ముప్పు కలుగుతుందన్నప్పుడు మాత్రం కమ్యూనిస్టుల విమానాలువచ్చి అమెరికన్ విమానాలతో పోరాడాయి కొరియాలో యుద్ధం ఈ రీతిగా ఆరుమాసాలనుంచి సాగింది. చివరికి చీనాకమ్యూనిస్టు లున్నంతకాలం సమితిసేనలు ఉత్తరకొరియన్ కమ్యూనిస్టులను జయించలేరనీ, కమ్యూనిస్టుల విమానబలం ప్రయోగించబడిందంటే సమితిసేనలు తిరిగి వెనక్కు తగ్గక తప్పదనీ తెలిసింది. చీనాకమ్యూనిస్టులు అదనపు సేనలను పంపినా కొరియానుంచి సమితిసేనలకు మళ్లీ ముప్పు సంభవించవచ్చును. ఇటు సమితిసేనలు కూడా వృద్ధిపరచబడినా సైనిక ప్రతిష్టంభన మారదనీ, దీర్ఘయుద్ధం జరిగినా జయాపజయాలు నిర్ధారణకావడం అసంభవమనీ స్పష్టపడింది.

## రష్యా శాంతి దౌత్యం

ఇట్టి పరిస్థితిలో 38 వ అక్షాంశం తిరిగి సరిహద్దుగా యుద్ధాన్ని విరమించడానికి సిద్ధంగా ఉన్నట్లు అమెరికన్ విదేశాంగ మంత్రి డీన్ ఎచిసన్ జూన్ 2 వ తేదీని ప్రకటించాడు.

ఎచిసన్ ఈవిధంగా ప్రకటించడానికి ముందు కొన్ని వదంతులు ప్రచారమైనాయి. ఫార్మోజా సమస్యగాని, ఐక్యరాజ్యసమితిలో పెకింగ్ ప్రభుత్వ సభ్యత్వ సమస్యగాని, రాజకీయరీత్యా పరిష్కారం కావని అన్ని దేశాలకూ స్పష్టపడింది.

కట్టడంకోసమే ఈ ప్రతిపాదన చెయ్యబడింది.

2. పెకింగ్ ప్రభుత్వంతో సంప్రదించకుండానే రష్యన్ ప్రతినిధి ఈ ప్రతిపాదన చేశారు. అమెరికన్, ఉత్తరకొరియన్ సైనికాధిపతులు యుద్ధాన్ని విరమించే ఉద్దేశంతో మాత్రమే సమాలోచనలు జరపడానికి వీలుందనీ, మిగతా సమస్యలవల్ల యుద్ధ విరామచర్యలకి భంగం కలగనవసరంలేదనీ రష్యా అభిప్రాయం. ఇతర సైన్యాల అధిపతులతో అవసరం లేకుండా అమెరికన్ ఉత్తరకొరియన్ సేనాధిపతులు సంప్రదించి యుద్ధాన్ని ఆపు చెయ్యవచ్చును.

3. తిరిగి ఎవరివల్లనూ దురాక్రమణ జరగబోదని తగినంత హామీని ఉభయపక్షాలూ ఇచ్చినట్లయితే (మిగతా సమస్యల ప్రమేయం లేకుండా) యుద్ధాన్ని నిలిపివెయ్యవచ్చునని రష్యా అభిప్రాయం. తూర్పు ఆసియా రాజకీయసమస్యలతో ఈ సమాలోచనలకు ప్రమేయం ఉండదు.

రష్యన్ ప్రతినిధి విశదీకరణ ఐక్యరాజ్యసమితిలోని వివిధదేశాల ప్రతినిధులకు సమ్మతమైంది. అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ ఆజ్ఞననుసరించి సమితిసేనాధిపతి జనరల్ రిడ్జివే యుద్ధవిరమణకోసం ఒక డేనిష్ నౌకలో సంప్రదింపులు జరపడానికి సిద్ధంగా ఉన్నట్లు కమ్యూనిస్టు సేనాధిపతి, ఉత్తరకొరియా ప్రధాని అయిన కిమ్ ఇల్ సుంగ్‌కు వార్త పంపాడు.

నేటికింకా (శనివారం జూన్ 30-వ తేదీకి) కమ్యూనిస్టులవద్దనుంచి సమాధానం రాలేదు. కాని సుముఖంగా సమాధానం వస్తుందని భావించవచ్చును. మాలిక్ ప్రతిపాదన చీనా ప్రజానీకానికి సమ్మతమేనని పెకింగ్ రేడియో ప్రకటించింది. కొరియానుంచి సమితిసేనలను తరిమివెయ్యడం తమ లక్ష్యమని చెప్పుకుంటూ వస్తున్న పయాంగ్‌యాంగ్ (ఉత్తరకొరియా) రేడియో ఉత్తరకొరియానుంచి తరమడం లక్ష్యమని ఇప్పుడు చెప్తోంది. ఇంతకుముందే చీనా కమ్యూనిస్టు 'వలంటీర్' సేనలు మూడింట రెండు వంతులు ఉత్తరకొరియానుంచి తరలిపోయినట్లు టోక్యోలోని సమితి సైనిక కార్యాలయాధికారి ఒకడు ప్రకటించాడు.



కొరియాలో యుద్ధాన్ని విరమించడం సాధ్యం కాకపోదని చెప్తూ శాంతి స్థాపనకు అవకాశం కల్పించిన రష్యన్ ప్రతినిధి జాకబ్ మాలిక్.

## క్లిష్ట సమస్యలు

యుద్ధచర్యల రీత్యా ప్రతిష్టంభన ఏర్పడిన ప్రస్తుత పరిస్థితి యుద్ధాన్ని విరమించడానికి ఎంత సుముఖంగా ఉన్నప్పటికీ, పరిష్కరించవలసిన సమస్యలు అతిక్లిష్టమైనవి రెండున్నాయి. అందువల్లనే శాంతిస్థాపనకు ఉభయపక్షాలూ హృదయపూర్వకంగా కృషి చెయ్యవలసిఉంటుందని రష్యన్ ప్రతినిధి నొక్కి చెప్పాడు.

1. 38 వ అక్షాంశరేఖ యుద్ధవ్యూహం దృష్ట్యా అనువైన సరిహద్దు కాదు. పశ్చిమాన ఈ రేఖకు దక్షిణంగా ముప్ఫై మైళ్ళలో హాన్ నదీ తీరానైనా, లేక ఉత్తరంగా పయాంగ్‌యాంగ్ - కుంవా ప్రాంతానైనా సరిహద్దుగా పెట్టుకోవలసిన అగత్యం కలుగుతుంది. ఇలా నిర్ణయించుకుంటేనే తిరిగి ఏ పక్షమూ సులువుగా దాడిచేసి యుద్ధం ప్రారంభించడానికి వీలుండదు. 38 వ అక్షాంశరేఖనే సరిహద్దుగా ఉంచినట్లయితే ఏ క్షణానైనా ఏ పక్షమైనా తిరిగి సులువుగా దాడిచెయ్యడానికి అవకాశం ఉండిపోతుంది. కాని పయాంగ్ యాంగ్ వద్ద సరిహద్దు ఏర్పాటు చెయ్యడానికి కమ్యూనిస్టులు కాని, సోల్ నగరంవద్ద సరిహద్దు ఏర్పాటు చెయ్యడానికి సమితి సేనలు కాని సమ్మతించడం అసంభవం. అందువల్ల తిరిగి దాడి జరిగేపక్షంలో ఎదుర్కోడానికి సిద్ధంగా ఉండే యత్నంతోనే 38 వ అక్షాంశ రేఖను సరిహద్దుగా నియమించుకోవాలని ఉభయపక్షాలూ నిర్ణయించవచ్చును. అంటే దక్షిణకొరియాలో సమితిసేనలు స్థిరస్థావరం ఏర్పరుచుకోడానికి సిద్ధపడాలన్నమాట.

ఈ సందర్భంలో టోక్యోలోని సమితిసైనిక కార్యాలయాధికారి ఒకడు చేసిన వ్యాఖ్య గుర్తించవలసింది ఉంది. యుద్ధంలో కష్టపడి చాల నష్టంపైన సరిహద్దుకు ఉత్తరాన కట్టని కోటలవలె ఉన్న కొండ ప్రాంతం వరకూ గెలిచిన నేలను ఇప్పుడు ఒప్పగించవలసి వస్తుందనీ, ఇప్పుడు శాంతి సూచన చెయ్యడంలో మోసమేదో ఉన్నట్లు తోస్తుందనీ ఈ అధికారి అన్నాడు. తిరిగి మరొకసారి చీనాసేనలు విజృంభించడానికి ప్రయత్నించినప్పటికీ పరాజయం పొందడం తథ్యమనీ, ఇప్పు

డా మేర వొదులుకున్నట్లయితే చీనా కమ్యూనిస్టులు విజృంభించడానికి ఎక్కువ అవకాశం ఉందనీ అన్నారు.

2. యుద్ధం విరమించబడిన అనంతరం ఎవరి సైన్యాలూ సరిహద్దు అతిక్రమించకుండా పర్యవేక్షణ చెయ్యడానికిగాను సమితితరఫున అజమాయిషీ ఉండాలనిసమితి సేనాధిపతి పట్టుబట్టవచ్చును కాని సమితి ఆధ్వర్యాన్ని కాని, జోక్యాన్ని కాని ఇంత వరకూ ఎన్నడూ సహించలేకపోయిన ఉత్తరకొరియన్ ప్రభుత్వం దీనికి సమ్మతించక పోవచ్చును అలాకాక సమ్మతించినట్లయితే, అటువంటి ఏర్పాటువల్ల, ఇంత వరకూ ఉత్తరకొరియన్ కమ్యూనిస్టు ప్రభుత్వాన్ని గుర్తించని ఐక్యరాజ్య సమితి ఇప్పుడు గుర్తించినట్లవుతుంది.

## వక్రగతి

వీటినిబట్టి ఒక విషయం స్పష్టపడుతుంది యుద్ధానైతే వెంటనే విరమించడం సాధ్యమే. కాని ఆపైన ఎవరి సైన్యాలు ఏ సరిహద్దులలోకి తరలిపోవాలనే సమస్యపైన సమాధానం కుదరడంకష్టం ఈసమస్యను గురించి దీర్ఘ సమాలోచనలు సాగవచ్చును.

కాని సమాలోచనలు విఫలమైనట్లయితే ఈనాటి యుద్ధంలో రష్యన్లు కూడా చేరగల ప్రమాదం తప్పకుండా ఉంది. యుద్ధం విస్తరించబడినట్లయితే రష్యన్లు కూడా యుద్ధంలో జోక్యం చేసుకునే ప్రమాదం ఉందని అమెరికన్ విదేశాంగ మంత్రి అన్నారు ఉత్తరకొరియాకురష్యా అన్ని విధాలా సహాయపడగలదని స్టాలిన్ ఇదివరలో వాగ్దానమిచ్చారు కూడా తూర్పు ఆసియాలో యుద్ధాలలో చిక్కుకో కూడదని ప్రయత్నిస్తున్న అమెరికా క్లిష్టసమస్యల్ని ఏదోవిధంగా పరిష్కరించి యుద్ధాన్ని విరమింపచెయ్యగలదని నమ్మవచ్చును ఆతరవాత కాశ్మీర్‌లో మాదిరిగానే రాజకీయ సమస్యలు పరిష్కారం కావు ఉభయపక్షాలా ప్రచారం జోరుగా సాగిపోతుంది

అయితే కొరియాలో ఇప్పుడు యుద్ధాన్ని విరమింపచేయడానికి రష్యన్లు ఎందుకు ఆతురపడుతున్నారనే విషయమై విశేష అనుమానాలు ప్రచారమౌతున్నాయి కొరియాలోశాంతినిస్థాపించి పర్షియాలోనో ఇండోచీనా, బర్మా సయాం దేశాలలోనో అంతర్యుద్ధాలను రెచ్చగొట్టడానికి రష్యా ప్రయత్నిస్తుందని కొందరి వాదం అలాకాక పర్షియాలో రష్యాను యుద్ధానికి రెచ్చగొట్టడానికే అమెరికా కొరియాలో యుద్ధాన్ని విరమించడానికి పన్నాగం పన్నిందని కొందరి వాదం దీనిలో ఎవరి వాదం నిజమైనదో తెలుసుకోవాలంటే కొరియాలో యుద్ధాన్ని విరమింప చెయ్యడానికి ఎవరు ముందు ఆత్రుత ప్రకటించారో కనిపెట్టాలి కాని ఇదికూడా ప్రచారం జోరులో నిర్ధారణగా తేలే వీలు లేదు మొదట వివరించిన ప్రకారం శాంతి సూచనల వక్రగతిని గమనించినట్లయితే రష్యా అమెరికాలు సమానంగా శాంతికి ప్రయత్నించినట్లు బోధపడుతుంది జూన్ నెలారంభంలోనే స్విట్జర్లాండ్ విదేశాంగ కార్యాలయాధికారికి రష్యన్లు చూచాయగా తెలపడమూ, అమెరికన్ కాంగ్రెస్ విచారణ సంఘంలో అమెరికన్ విదేశాంగమంత్రి శాంతికి తన షరతులు తెలపడమూ, ఐక్యరాజ్యసమితి, కార్యదర్శి ట్రిగ్వీలీకూడా దాదాపు అదే ధోరణిలో శాంతి ప్రతిపాదన చెయ్యడమూ జరిగింది.

అందువల్ల పర్షియాలో యుద్ధాన్ని రెచ్చగొట్టడానికి ఎవరు ప్రయత్నిస్తున్నారో నిర్ధారించడం కష్టం కాని ఒక్క విషయంమాత్రం స్పష్టంగా తెలుస్తూనే ఉంది. పాశ్చాత్య రాజ్యకూటంలోని రాజ్యాలను మరింత అధికంగా తన అదుపులోకి తెచ్చుకోడానికి అమెరికా, కమ్యూనిస్టు వర్గరాజ్యాలను, ముఖ్యంగా చీనాదేశాన్ని, రష్యన్ విదేశాంగ విధానాన్ని పూర్తిగా అనుసరింప చెయ్యడానికి రష్యా చిన్న చిన్న యుద్ధాలను పరికరంగా ఉపయోగిస్తున్నాయి కొరియా యుద్ధం మూలంగా అట్లాంటిక్ పాక్టు పేరుతో ఆయుధబల నిర్మాణానికి పశ్చిమ యూరప్ దేశాలను అమెరికా పూర్తిగా అంగీకరింపచెయ్యకలిగింది ఇంక అరబ్ రాజ్య ప్రాంతాలను, మిగిలిన తూర్పు ఆసియా ప్రాంతాలను (అనగా బర్మా, సయాం, ఇండోచీనా, ఫిలిప్పైన్స్ మొదలైన దేశాలను) దృఢమైన రక్షణ సన్నాహాలలోకి తీసుకురావడానికి కొన్ని అంతర్యుద్ధాలు, రాజకీయ సమస్యలు తెచ్చిపెట్టడం అవసరం కావచ్చును

అంటే రష్యానుగురించి అమెరికా ఏ ప్రచారం చేస్తున్నదో, అటువంటి చిన్న చిన్న యుద్ధాలను ప్రేరేపించడానికి అమెరికాకూడా ప్రయత్నిస్తున్నదనీ, పెద్ద యుద్ధాలుగా పరిణమించనంతవరకూ ఇటువంటి చిన్నయుద్ధాలవల్ల అమెరికన్లకు కూడా అధికప్రయోజనం ఉన్నదనీ స్పష్టమౌతోంది

# పారిస్ సమాలోచనలు

జర్మనీ ఆయుధబల పునర్నిర్మాణాన్ని గురించి చర్చించాలనే ఉద్దేశంతో ప్రారంభించబడిన పారిస్ అగ్రరాజ్య చతుష్టయ సమావేశం, అట్లాంటిక్ పాక్టునుగురించిన వివాదంతో భగ్నమైపోయింది మార్చి నెలారంభంలో ప్రారంభించి, 74 మార్లు అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచ్, రష్యన్ డిప్యూటీ విదేశాంగమంత్రులు సమావేశాలు జరిపి చివరికి ఒప్పందం కుదుర్చుకోకుండా ఎవరిదారిన వారు వెళ్లిపోయారు

జర్మనీలో సైనిక, ఆయుధబలాలను నిర్మించాలని అమెరికా, బ్రిటన్, ఫ్రాన్సులను ఒప్పించిన తరువాత, అది అగ్రరాజ్యాలమధ్య ఒడంబడికకూ, ఆంగ్లో-రష్యన్, ఫ్రాంకో-రష్యన్ ఒడంబడికలకూ విరుద్ధమని రష్యా ఆక్షేపణ తెలిపింది ఈ ఆక్షేపణకు సమాధానమిస్తూ రష్యా సైనికబల నిర్మాణాల ఫలితంగా పశ్చిమయూరప్ పైన దురాక్రమణసంభవించగల ప్రమాదం ఏర్పడిందనీ, రష్యా అనుసరిస్తున్న విధానంవల్లనే పశ్చిమ జర్మనీ రక్షణనిమిత్తం సన్నాహం చెయ్యవలసిన అగత్యం కలిగిందనీ అమెరికా, బ్రిటన్ ఫ్రాన్సులు తెలిపాయి అందువల్ల

(45-వ పేజీచూడండి)

# డైరీ

## ఆదివారం, జూన్ 24 :

—ప్రచారంకోసం కాక, సదుద్దేశంతోనే కొరియాలో శాంతి స్థాపన ప్రతిపాదనల్ని సోవియట్ రష్యన్ ప్రతినిధి జాకబ్ మాలిక్ సూచించి ఉన్నట్లయితే, యుద్ధవిరమణకు, సమాలోచనలకు అమెరికా సిద్ధంగా ఉన్నట్లు విదేశాంగ కార్యాలయం ప్రకటించింది

—రాజకీయ సమస్యలతో ప్రమేయం లేకుండా కొరియాలో యుద్ధాన్నీ రక్తపాతాన్నీ నివారించడానికి మాలిక్ సూచనప్రకారం సమాలోచనలు ప్రారంభించబడాలని ఐక్యరాజ్యసమితి కార్యదర్శి ట్రిగ్వీలీ ప్రకటించారు

—1950 జూన్ 25 మొదలు (అనగా కొరియాయుద్ధం ఆరంభమైనది మొదలు) 1952 జూన్ వరకూ అమెరికన్ ప్రభుత్వం మొత్తం 7500 కోట్ల డాలర్లను సైనిక సన్నాహాల నిమిత్తం ఖర్చుపెడుతుందని అంచనా వెయ్యబడింది

—పర్షియాలో కెర్మాన్షానూ నెయుం త్రాగారాలను పర్షియన్ సేనలు వశపరుచుకున్నాయి యంత్రాగారం మూసి వెయ్యబడింది.

—ఖాట్మండూకి 200 మైళ్లు పశ్చిమంగా ఉన్న పైరాన్ నగరాన్ని గూర్ఖాదళం ఆక్రమించుకొన్నట్లు నేపాల్ ప్రభుత్వానికి వార్త చేరింది.

—కాశ్మీర్‌లో భారతసైన్యాల ఆక్రమణలో ఉన్న ప్రాంతంలో ఒక గ్రామంపైన పాకిస్తాన్ సిపాయిలు దాడిచేసి ఇద్దరు భారత సిపాయిల్ని హత్యచేశారు

—వాక్స్వాతంత్ర్యాన్ని అరికట్టే నూతన రాజ్యాంగ నియమంపట్ల అసమ్మతి సూచకంగా ప్రభుత్వసలహా సంఘాలనుంచి పత్రికాధిపతులు నిష్క్రమించాలనీ, జూలై 12 వ తేదీని పత్రికలన్నీ హర్తాళ్ చెయ్యాలనీ అఖిలభారత పత్రికాధిపతుల సంఘం తీర్మానించింది

—హైదరాబాద్ కాంగ్రెస్‌లో ఎన్నికల సంఘ నియామకం విషయమై ఉత్పన్నమైన అభిప్రాయ భేదాలను గురించి చర్చించడానికి డా॥ చెన్నారెడ్డి, జి రామాచారి గార్లు ఢిల్లీ వెళ్లారు.

## సోమవారం, జూన్ 25 :

—సోవియట్ రష్యా తరఫున జాకబ్ మాలిక్ చేసిన కొరియా యుద్ధవిరమణ ప్రతిపాదనపట్ల పెకింగ్ ప్రభుత్వం సుముఖత ప్రకటించింది

—కొరియన్ యుద్ధాన్ని విరమింపచేసే యత్నంలో అమెరికా పాల్గొనగలదని అమెరికన్ అధ్యక్షుడు ట్రూమన్ అన్నారు

—కొరియా శాంతి ప్రతిపాదనలో కొన్ని అంశాలను విశదీకరణకోసం ఐక్యరాజ్య సమితి అధ్యక్షుడు నస్రుల్లా ఇంతజామ్ చేసిన యత్నాలు మాలిక్ అనారోగ్యంవల్ల విఫలమైనాయి

—ఆయిల్ టాంకర్ రసీదులపైన సంతకం చెయ్యడానికి నిరాకరించిన ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ మేనేజరు ఎరిక్ డ్రేక్ పైన విధ్వంసక యత్న నేరాన్ని పర్షియన్ ప్రభుత్వం ఆరోపించింది బ్రిటిష్ప్రభుత ...చనపైన డ్రేక్ పర్షియాదేశం విడి... ...సా (ఇరాక్) వెళ్లాడు

—జపాన్ ఇకముందు నష్టపరిహారం చెల్లించలేదనీ, ఇంతవరకూ జపాన్ ఆర్థిక స్థితి కూలిపోకుండా నిలపడానికి అమెరికన్ ప్రభుత్వం 200 కోట్ల డాలర్లు వెచ్చించిందనీ, జపాన్ శాంతిసంధిలో సైనికబల ప్రమాణాన్ని నిర్ణయించబోరనీ, జాన్ ఫాస్టర్ డలెస్ ప్రకటించారు

## మంగళవారం, జూన్ 26 :

—కొరియా శాంతి ప్రతిపాదనలో నాలుగు అంశాలను విశదీకరించవలసిందని సోవియట్ రష్యా ప్రభుత్వాన్ని బ్రిటిష్ ప్రభుత్వం కోరుతున్నదని లండన్ వార్త

—కొరియాలో సమితిసేనలదే పైచెయ్యిగా ఉన్నప్పుడు, శాంతి ప్రతిపాదనలకు సమ్మతించడంవల్ల నష్టం ఉన్నదని టోకియోలో జనరల్ రిడ్జివే కార్యాలయాధికారి ఒకడు అన్నాడు

—కొరియా శాంతి ప్రతిపాదనకు సమ్మతించడం దక్షిణకొరియన్ రిపబ్లిక్‌ను అవమానించినట్లే అని అధ్యక్షుడు సింగ్మన్ రీ అన్నాడు

—జపాన్‌తో శాంతి సంధి జరగకుండా వీలైనన్ని రోజులు నివారించడం కోసమే కొరియాలో శాంతికి రష్యా ప్రతిపాదిస్తున్నదని జపాన్ విదేశాంగ శాఖాధికారి ఒకడన్నాడు.

—ఆఫ్ఘనిస్తాన్ మొదలు జపాన్ వరకూ గల ఆసియా దేశాలన్నీ చినా కమ్యూనిస్టుల దురాక్రమణకు లోబడగల ప్రమాదం ఉన్నదని అమెరికన్ విదేశాంగమంత్రి కాంగ్రెస్‌లో సైనిక, ఆర్థికసహాయ శాసన చర్చ సందర్భంలో చెప్పారు

—బ్రిటిష్ విదేశాంగమంత్రి మారిసన్ తిరిగి పర్షియన్ ప్రభుత్వాన్ని హెచ్చరించారు బ్రిటిష్ ఉద్యోగుల రక్షణ నిమిత్తం 'మారిషియస్' యుద్ధనౌకను అబడాన్‌కు పంపుతూ బ్రిటిష్ప్రభుత్వం ఆజ్ఞ ఇచ్చింది సూయజ్ కాలువప్రాంతంలోని బ్రిటిష్ సేనల్ని బాస్రా (ఇరాక్)కు పంపారు

—పర్షియా సమస్యవల్ల పెట్రోలియం లోటు రాకుండా అన్ని దేశాలకూ సప్లై చెయ్యడానికిగాను అమెరికన్ ప్రభుత్వం,



శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారి కుమారుడు, శ్రీ ఏ యస్ రావుగారి కుమార్తెల వివాహం మచిలీపట్నంలో జరిగింది

అమెరికన్ ఆయిల్ కంపెనీలూ ఒక ఒడంబడిక చేసుకున్నాయి

—ఢిల్లీ, మాస్కో నగరాలమధ్య వైర్లెస్ - టెలిగ్రాఫ్ సౌకర్యం జూన్ 18 నించీ ఏర్పాటు చెయ్యబడినట్లు ప్రభుత్వం నేడు తెలియచేసింది

—అమ్మకపు పన్నులలో అవసర వస్తువులపై విధించిన రాష్ట్రాలకు ప్రస్తుత పార్లమెంటు నిషేధశాసనం వర్తించదని భారత ఆర్థికశాఖ స్టేట్ మంత్రి మహావీరత్యాగి చెన్నపట్నంలో అన్నారు

—రైల్వే కార్మిక సంఘసమితికి చెందిన మొత్తం 30,353 మంది సభ్యులలోనూ సమ్మె బాలట్ లో 27,869 మంది పాల్గొన్నారనీ, వీరిలో 27,614 మంది, అనగా 99 08% సమ్మెకు సుముఖంగా ఓటు చేశారని సమితి ప్రధాన కార్యదర్శి ప్రకటించారు

—ఆంధ్ర విశ్వకళాపరిషత్తు ప్రో - ఛాన్సెలర్ గా (స్వర్గీయ విక్రమదేవవర్మ గారి స్థానే) మద్రాసు ఆర్థికశాఖామంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు నియమితులైనారు

బుధవారం, జూన్ 27 :

—కొరియాలో శాంతిస్థాపన యత్నాలకు సుముఖంగా ఉన్నట్లు యుద్ధంలో పాల్గొంటున్న 16 దేశాల ప్రతినిధులూ కలిసి వాషింగ్టన్ లో ప్రకటించారు

—కొరియా శాంతిప్రతిపాదన గురించి మాస్కోలోని అమెరికన్ రాయబారి ఎడ్మిరల్ ఎలన్ కర్క్ రష్యన్ డిప్యూటీ విదేశాంగమంత్రి ఆండ్రీగ్రోమైకోను కలుసుకున్నాడు

—ఐక్యరాజ్య సమితివారి విద్యా, సాంస్కృతిక, విజ్ఞానసంఘంలో చీనా తరఫున కోమింటాంగ్ ప్రతినిధికే సభ్యత్వం ఉంచడానికి నిర్ణయించబడింది

—బ్రిటిష్ యుద్ధనౌక అబడాన్ రేవు చేరినందువల్ల పర్షియన్ సైన్యాలను ముసాదిక్ ప్రభుత్వం వెంటనే యంత్రాగారాల వద్దకు పంపింది

—నూనె ఉత్పత్తి నిలిచిపోయినట్లయితే సంభవించగల ప్రమాదాల దృష్ట్యా బ్రిటిష్ వారితో సమాధానం చేసుకోవలసిందని పర్షియన్ ప్రభుత్వానికి అమెరికన్ విదేశాంగ మంత్రి ఎచిసన్ సందేశం పంపాడు

—పర్షియన్ ప్రభుత్వానికి సలహా ఇవ్వడం నిమిత్తం ఇటాలియన్ ఆయిల్ పరిశ్రమ నిపుణుడు డా॥ మెరియో కరాంఫా టెహరాన్ నగరం చేరాడు

—కాశ్మీర్ సమస్యను గురించి సమితి మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహంతో భారతప్రభుత్వంలాంఛన ప్రాయంగానైనా సరే సంభాషణలు జరపకూడదని కాశ్మీర్ ప్రభుత్వం తెలిపింది

—ఇండొనీషియాకు భారత రాయబారిగా సయ్యద్ అలీ జహీర్ నియమితులైనారు

—విశాఖజిల్లానుంచి మద్రాసు శాసనసభకు బైఎలెక్షన్ లో శ్రీ తెన్నేటి విశ్వనాదంగారికి ప్రత్యర్థిగా కాంగ్రెస్ అభ్యర్థిని నిలబెట్టవద్దని కాంగ్రెస్ అధ్యక్షులు టండన్ గారు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కు ఆజ్ఞ ఇచ్చారు

—ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి యత్నాలు జరుగుతున్నాయని కాంగ్రెస్ కార్యదర్శి కళా వెంకట్రావు గారు విజయవాడలో చెప్పారు

—వ్యభిచార నేరానికి పురుషునితో సమానంగా స్త్రీకికూడా శిక్షవిధించబడక పోవడం రాజ్యాంగ నియమవిరుద్ధం కాదని బొంబాయి హైకోర్టు ఒక కేసులో తీర్పు ఇచ్చింది

గురువారం, జూన్ 28 :

—మాస్కోలోని అమెరికన్ రాయబారి కోరికపైన రష్యన్ విదేశాంగశాఖ డిప్యూటీ మంత్రి ఆండ్రీ గ్రోమైకో కొరియా శాంతి ప్రతిపాదనను విశదీకరిస్తూ, యుద్ధ విరామానికి సమాలోచనలు కేవలం సైనిక సమస్యల దృష్ట్యానే, యుద్ధరంగంలోని సైనికాధిపతుల మధ్య జరగాలని చెప్పాడు

—గత ఏప్రిల్ నుంచీ ఉత్తరకొరియా నుంచి చీనా కమ్యూనిస్టు సేనలు మంచూరియాకు తరలిపోతున్నాయని టోకియోలోని సమితి సైనిక కార్యాలయాధికారి ఒకరు తెలియపరిచారు.

—అబడాన్ లో ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీ జనరల్ మేనేజర్ కార్యాలయాన్ని పర్షియన్లు స్వాధీనపరుచుకున్నందువల్ల యంత్రాగారాలను 48 గంటల్లో మూసివెయ్యడానికి కంపెనీ నిర్ణయించింది ఆయిల్ టాంకర్లన్నిటినీ అబడాన్ రేవునుంచి కంపెనీ తరలించివేసింది

—ఇరానియన్ నూనెగనులను విడిచిపెట్టరావలసిందని బ్రిటిష్ ప్రభుత్వం 130 మంది ముఖ్యఉద్యోగులకు ఆజ్ఞఇచ్చింది

విధ్వంసక చర్యలకు సంబంధించిన శాసనాల్ని అమలుజరపకుండా ఉండాలంటే బ్రిటిష్ ఉద్యోగు లందరూ రాజీనామాలు రద్దుపరుచుకుని పర్షియన్ ప్రభుత్వం కింద పనిచెయ్యడానికి అంగీకరించాలని ప్రధాని ముసాదిక్ ప్రకటించాడు.

—బ్రిటిష్ సైన్యాలను అధికంగా చేర్చనిచ్చినందుకు పర్షియన్ ప్రభుత్వం ఇరాక్ ప్రభుత్వానికి నిరసన తెలిపింది

—పర్షియన్ ఆయిల్ పరిశ్రమ నిలిచిపోకుండా ఉండాలంటే సమస్యను పరిష్కరించడంలో అమెరికా తోడ్పడాలని ట్రూమన్ కు పర్షియా ప్రధాని స్వయంగా లేఖ వ్రాసినట్లు టెహరాన్ వార్త

—ఆయిల్ పరిశ్రమ లగాదాను శాంతియుతంగా పరిష్కరించుకోవలసిందని పర్షియన్ ప్రభుత్వానికి భారత ప్రధాని పండిట్ నెహ్రూ సలహా ఇచ్చారు

—పర్షియాకు చెల్లించవలసిన పదకొండు టన్నుల బంగారాన్ని రష్యా చెల్లించడానికి సిద్ధపడినట్లు టెహరాన్ వార్త

—జపాన్ శాంతి సంధిసమాలోచనల్లో ఉత్తరకొరియా ప్రభుత్వంకూడా పాల్గొనాలని రష్యన్ ప్రభుత్వానికి ఉత్తర కొరియన్ ప్రభుత్వం తెలిపింది

—జోర్డన్ నదిపైన డామ్ కట్టి తమకు నీటిపారుదలను అరికట్టుతున్నారని ఇజ్రాయిల్ ప్రభుత్వంపైన జోర్డన్ ప్రభుత్వం భద్రతామండలికి ఫిర్యాదు చేసింది

—వ్యవసాయ కూలీలకు కనీసవేతనం నిర్ణయించే ఏర్పాట్లు చేయాలని వివిధ దేశాల ప్రభుత్వాలకు ఆదేశమిచ్చే తీర్మానాన్ని అంతర్జాతీయ కార్మికసంస్థ ఆమోదించింది

—భారత వాణిజ్య శాఖమంత్రి హరికృష్ణ మెహతాబ్ గారితో మద్రాసులో

(44-వ పేజీ చూడండి)

కథానిక:

# కపాలమోక్షం

శ్రీ వి. వి. సూర్యనారాయణ

నిర్వీరామానంద స్వాములవారు మర్నాడు వస్తున్నారని ముందురోజే తెలిసింది, చెన్నూరుగ్రామంలో. భక్తులందరికీ గ్రామాన్ని ముస్తాబు చెయ్యడం, స్వామివారికి కావలసిన హంగులన్నీ సమకూర్చడంలో ఎవ్వరికీ ఊపిరాడ్డంలేదు. నాలుగు నెలలనుండి బూజుపడుతూన్న ఆలయం తలుపులు తెరిపించి శుభ్రపరిచారు. స్వామివారు చెప్పబోయ్యే సుధామధురోక్తులను భక్తులు సావధానంగా కూర్చొని వినడానికి ఆలయంముందు ఖాళీజాగాలో చక్కగా పందిరి వెయ్యబడింది. స్వామివారు ఆ గ్రామంలో తొమ్మిది రోజులకంటె ఎక్కువ ఉండడానికి సావకాశం లేదని ముందే శెలవిచ్చారు. ఊళ్ళో ఉన్న మోతుబర్లూ, పలుకుబడిగలవాళ్ళూ వాటా వేసుకుని దినానికొకళ్లు చొప్పున ఆయన్ను భిక్షకు పిలిచే యేర్పాటు చేసుకున్నారు. నిజానికి ఒక్కొక్కళ్లే స్వామివారిని వరసగా తొమ్మిదిరోజులూ సేవించగల తాహతు ఉన్నవాళ్లు. కాని ఆయన అక్కడ ఉండదల్చుకున్న కాలం చాలా స్వల్పం కావడంచేతా, ఆయనను సేవించే భాగ్యం అంతా సమంగా పంచుకోవాలనే సుహృద్భావంకలవాళ్లు కావడంచేతా ఆ ఊరి పెద్దలు యిలా వంతులు వేసుకోవలసివచ్చింది

నిర్వీరామానందస్వామి అంటే సామాన్యుడు కాదు. వేదం ఎనభైరెండు పన్నాలూ ముందునుండి వెనక్కూ, వెనకనుండి ముందుకూ నిరాఘాటంగా అప్పచెప్పగల సమర్థుడు. చతుష్షష్టి కళలూ ఆయనకు కరతలామలకం అంటారు. ఆయనకు దివ్యదృష్టి కూడా ఉందని ప్రతీతి

స్వామివారి ముఖంలో భక్తులకు బ్రహ్మతేజస్సు గోచరిస్తుంది; ఆయన పలుకుల్లో మధురమైన సంగీతం వినిపిస్తుంది. ఆయన అనుగ్రహంవల్ల చాలామంది భక్తులు ఐశ్వర్యవంతులయారుట! ఆశీర్వాదాన్ని పొందిన రోగులు ఆరోగ్యవంతులయారుట!! పిల్లలేని స్త్రీలు ఆయన అనుగ్రహం కలిగిన సంవత్సరంలోగానే గుమ్మడిపళ్లలాంటి పిల్లల్నెత్తుకున్నారుట!!! అటువంటి మహత్తరమైన శక్తులు గలవాడు కావటంచేతనే, ఆయన వస్తున్నాడంటె ఊళ్లో యింత హంగామా; యింత హడావుడీనూ

నిర్వీరామానందస్వామి తమ ముప్ఫయ్యోపడిలో సన్యాసం స్వీకరించేరు. ఆయన సన్యాసం స్వీకరించడాన్ని గురించి కిట్టనివాళ్లేవో కట్టుకథలు చెప్తూ ఉంటారు. మోక్షకాములైన భక్తులకు అవి వర్ణనీయాంశాలు కాదు

ఇప్పుడాయనకు నలభైఅయిదు వసంతాలు నిండినా ముప్ఫయిఅయిదేళ్ల యువకుల్లాగా కనపడతారు. అలా కనపడ్డం, ఆయన ఆహారవిహారాదుల్లో చాలా నియమబద్ధంగా ఉండడంవల్ల కావచ్చు; లేక కాయకల్పచికిత్సవల్లనైనా కావచ్చు.

స్వామివారు అపరవీరభోగవసంతరాయుడంటే అతిశయోక్తి కాదు. ఆడా, మగా కలిసి దాదాపు వందమందిపైగా ఉన్నారాయన శిష్యులు. అంతే కాకుండా ఏనుగులూ, గుర్రాలూ, బళ్లూ, ఎద్దులూ—ఒకటేమిటి, సర్వమూ ఉన్నాయి ఆ సర్వసంగ పరిత్యాగులైన నిర్వీరామానందుల వారికి. ఆయన పాదపూజకే నూటపదహార్లు పుచ్చుకుంటారుట! భిక్షకైతే వెయ్యిన్నూటపదహార్లు అక్కడ పెట్టవలసిందే!!

సర్వసంగ పరిత్యాగులకూ, మహనీయులకూ ధనంతో పనేమిటని ఎవరైనా తెలివిమాలిన కుంక ప్రశ్నించవచ్చు. కాని, యీ కట్నాలూ కానుకల్లో ఆయనకు ఒక్క దమ్మిడీ అవుసరంలేదు. అవన్నీ ఆయన పరివారాన్ని పోషించడానికి మాత్రమే స్వీకరిస్తున్నారు. ఆయన అనుచరులు ఒకరిద్దరు కనుకనా? వందమంది పైగా ఉన్నారాయె—జంతుజాలాన్ని మినహాయించుకుని.

మర్నాడు ఉదయాన్నే ఏనుగులూ, గుర్రాలూ, బళ్లూ, ఎద్లూ, లొట్టిపిట్టలూ ఆ వూరి పాటిమీద కాళ్లుపెట్టేయి. వాటిని చూడ్డంతోటే ఆ వూరి కుర్రకుంకలంతా ఊళ్లోకి సర్కస్ కంపెనీ వచ్చిందనుకొని సంతోషంతో గెంతడం మొదలుపెట్టేరు. 'సర్కస్ ఏమిట్రా! తప్పు, తప్పు. స్వాములారొస్తున్నారు,' అని చెప్పి వాళ్లను మందలించేరక్కడున్న పెద్దలంతా. ఆ మాట విన్నాక కుర్రాళ్ళలో సగం ఉత్సాహం దిగజారిపోయింది

మరో గంటకి స్వాములారెక్కిన పల్లకీని నలుగురు సద్బ్రాహ్మణులు వేదఘోషతో మోసుకొచ్చి, ఆలయంముందు దించి ఎవరు చూడకుండా భుజాలు తడుముకుని, చేతులు ఝాడించుకున్నారు

కరణం సీతారామయ్యా, మునసబూ, బుచ్చిరెడ్డీ, వంకటేశ్వర్లూ, వీరాస్వామీ మొదలైన ముఖ్యులంతా స్వామివారి సన్నిధికి వచ్చి నించున్నారు

'ఉదయాన్నే స్వాములవారు ఏమీ తినరు. కల్తీలేని గోక్షీరం తెప్పించండి, ఒక అర్ధసేరు పుచ్చుకుంటారు' అన్నాడు, స్వామివారి శిష్యగణంలో ముఖ్యుడు ముందుకొచ్చి

అక్కడున్నవారిలో బుచ్చిరెడ్డి 'చిత్తం' అని చెప్పి యింటికి బయలుదేరాడు, పాలు తీసుకొని రావడానికి

వెళ్తూన్న బుచ్చిరెడ్డిని వెనక్కి పిల్చి హెచ్చరించాడు, స్వామివారి శిష్యుడు. 'పంచదార వెయ్యకండేం, పాలల్లో. అటువంటి అపవిత్రమైన వస్తువులు గురువుగారికి పనికిరావు,' అన్నాడు

పంచదారని తెలుపు చెయ్యడానికి ఎముకలు ఉపయోగిస్తారని ఎక్కడో విన్నాడు, బుచ్చిరెడ్డి. బహుశా అందుకే పంచదార అపవిత్రమైన వస్తువు అయివుండాలి. 'అయితే, బెల్లం వెయించమన్నారా?' అన్నాడు, బుచ్చిరెడ్డి అమాయకంగా.

'ఛీ! ఎందుకూ? పటిక బెల్లం చాలు'

'అల్లాగే,' అని వెళ్లిపోయాడు బుచ్చిరెడ్డి

గుర్రాలకూ, ఏనుగులకూ ఊరి పొలిమేరలో పెద్దపెద్ద సాలలు వెయ్యబడ్డాయి. శిష్యులందరికీ ఇంద్రభవనంలాటి విడిది యేర్పాటు చెయ్యబడింది. స్వామివారు మాత్రం ఆలయంలోనే కల్యాణమండపం మీద విశ్రమించారు. ఆయనకు ఎండదెబ్బ తగలకుండా మండపానికి చుట్టూ వట్టివేళ్ల చాపలు వ్రేలాడగట్టేరు, భక్తులందరూ కలిసి వాటిని ఆరార తడపడానికి మునసబుగారి పెద్దకొడుకు వీరాస్వామి ప్రత్యేకంగా అక్కడ ఉండిపోయాడు.

గ్రామస్తులు వేసుకున్న వంతుప్రకారం స్వామివారు ఆ రోజు కరణంగారింట్లో

(46-వ పేజీ చూడండి)



# ఎక్కడుంది న్యాయం?

"రంగనాథం"

అది శీతాకాలం. చలిగాలి రైలుని ఒక వైపునుండి మరియొక వైపుకు తోస్తూవుంది. రాత్రి దగ్గర దగ్గర కావస్తూంది. చీకటి బావురు బావురుమంటూ అవులిస్తున్నట్లుంది. రైలునుండి మూటతో సహా దిగినవ్యక్తి చలిగాలినిగూడా లెక్క చేయకుండా, ఆయాసపడుతూ గబగబా సాగిపోతూ వున్నాడు. రైలు కదిలి వెళ్లిపోయింది.

"ఎవరది" నిశ్శబ్దంగా వుండడంవల్ల శబ్దం రెట్టించింది. ఆ వ్యక్తికి గుండెల్లో రాయిపడింది. పోలీసను కొని శరీరం వణక సాగింది. కాళ్ళు ముందుకు సాగడంలేదు. పిలిచిన వ్యక్తి లైటుతో సహా దగరకు వచ్చాడు "ఏయ్! టిక్కెటేది" అని వచ్చినవ్యక్తి అధికార పూర్వకంగానే అడిగాడు. వణుకుతున్న చేతులతో జేబు నుండి టిక్కెట్టుతీసి యిచ్చాడు.

"ఈమూటకు లగేజ్ పాస్ ఏది?"

"లగేజ్ చేయడానికి టైము లేకపోయింది, బాబయ్యా అందుచేత చేయలేకపోయాను"

"చేసేది దొంగపని దానికితోడు మరో దొంగపని దానిని కప్పి పుచ్చడానికి అబద్ధాలు" అంటూ యీసడించుకున్నాడు మహాసత్యవ్రతుడులాగ "సరే! అదంతా నాకెందుకు ఎక్సెస్ మూడురూపాయలవుతుంది. కట్టి రసీదు తీసుకుని మరీ వెళ్ళు. లేకపోతే పోలీసుకు పట్టిస్తా"

పోలీసు మాట వినగానే ఆవ్యక్తికి నిలువెల్లా ముచ్చెమటలు పోశాయి. "బాబయ్యా! క్షమించాలి ఏదో కడుపుకక్కుర్తి ఏం చేయమంటారు మీరంత దిగితే ఎట్లా నాదగ్గర డబ్బులేదు ఇదిగో! ఈ రూపాయి తీసుకోండి" "నాకేం ధర్మానికిస్తున్నావా!" "లేదుబాబయ్యా! అట్లా అంటానా! ఉంటే యిచ్చేవాడినే ఈసారికి దయదల్చండి" అంటూ, జేబు నుండి రూపాయి కాయితం, తీసి మాస్టరుగారిచేతిలో పెట్టుతుండగా, "మాస్టరు గారూ!" అంటూ పోర్టరు పిలిచాడు. పోర్టరు పిలుపు విని మాస్టరు వాడెక్కడ భాగంకు వస్తాడోనని, "సరే యీసారికి వెళ్ళు" అంటూ ఎంతో దయగా మాట్లాడాడు. 'వెధవలు పట్టుకుంటే ఏమిస్తారు చేసేవి, వెధవపనులు,' అంటూ లోపలికి వెళ్ళిపోయాడు. పోర్టరుకేదేమీ అర్థంగాక, వచ్చిన టిక్కెట్లు పేర్చుకొని తనూ లోపలికి వెళ్లాడు.

బ్రతుకు జీవుడా అనుకుంటూ, ఆవ్యక్తి మూట బరువుగా వున్నప్పటికి, ఎక్కడ పోలీసువాడు వస్తాడోనని భయంకొద్దీ గబగబ నడచి సందు మలుపుతిరిగాడు. నెత్తి మీద మూటభారం ఎక్కువైంది. అందువల్ల యిక నడువలేక, ఎక్కడైనా రిక్షా దొరుకుతుందేమోనని, మూటకిందికి దించి/ నలువైపులా కలయచూశాడు. కాని ఎక్కడా రిక్షా కనిపించలేదు. ఒక దగ్గిర కొంచెం దూరంలో మాత్రం ఒక రిక్షా కనిపించింది. ఏరిక్షా అని పిలిచాడు. కాని జవాబులేదు. నెమ్మదిగా మూటనెత్తిని పెట్టుకొని, రిక్షా దగ్గరకు వెళ్లాడు. రిక్షావాడు పగలంతా చేసిన కష్టాన్ని సేదతీర్చుకుంటున్నట్లు సగం శరీరం రిక్షాలోవుంచి, ముగతగా నిద్రపోతూ వున్నాడు చలికి శరీరాన్ని ముడుచుకుంటూ. "ఏయ్! రిక్షా" అని వచ్చినవ్యక్తి పిలుపును నిద్రలో విన్నట్లు

(12-వ పేజీ చూడండి)



బోదె సుడులు తిరుగుతూ ప్రవహిస్తోంది ధర్మన్న బోదెకి గట్టు వేస్తున్నాడు తన రెండెకరాల భూమికి నీరు పెట్టుకుందామని న్యాయానికి తనవంతు ప..రోజులు ముందుగానే వచ్చినా మోతుబరి రైతుల ఎత్తుబడికి లొంగిపోయి తనవంతును వదులుకోవలసి వచ్చింది ఈ పదిరోజులలోను ఎండలు మెండుగా కాశాయి నీటిచుక్కకి మొగం వాచి చేలన్నీ మొగాలు ప్రేలాడేశాయి ఈ సమయంలో కనక నీరు లేకపోతే మరొక కాటకం రావడం తథ్యమనుకొంటున్నారు అంతా ఓవర్సీరుగారికి మామూలు న్నా ఎక్కువగా ముట్టినా మామూలు నీటినయినా వదలడం లేదు తూముల్లోంచి నెరియలుపడ్డ భూమి బిర్ర బిగుస్తోంది బో లో కన్నా కాస్తా నోరున్న ఖామందులు ముందు పుచ్చుకొంటున్నారు బక్క రైతుల చేలు మాడిపోతున్నాయి వంతులకోసం రైతులు తగూలాడుకు చస్తున్నారు ఒకసారి నీరు ఎక్కిన పొలాలకే మళ్ళా నీరు కావలసి వస్తాంది చిన్న రైతులని బెదిరించుకొని పెద్ద రైతులంతా తమ మళ్ళకి మళ్ళా మళ్ళా నీళ్లు పెట్టుకొంటున్నారు చిన్న రైతులు నోరెట్టుకు పడలేక, తమ పొలాలు బీడులవుతున్నప్పటికీ గుడ్లప్పగించి చూస్తూ వూరుకున్నారు

వీరన్న పాతిక ఎకరాల విఖండీ చేను నిండడానికి ఈ పదిరోజులు పట్టింది అప్పుడుగాని ధర్మన్నని తన చేనుకి నీరు పెట్టుకోనివ్వలేదు చేను నీరులేక ధ్వంసమయినప్పటికీ నోరెత్తలేక పెద్దరయితుల దయాధర్మ భిక్షంగా ఇచ్చిన కంటనీటిని ఇపుడు తన పొలానికి పెట్టుకుంటున్నాడు. ఈ నీరైనా పడితే ఎకరానికి అయిదు బస్తాలయినా పండుతుందేమోనని అతడి ఆశ ఆపండే గింజలు పన్నుకేనా చాలవు తన తిండి మాట తలుచుకుంటుంటే ధర్మన్నకి కడుపు తరుక్కుపోతూ వుంది గంపెడు సంసారం నెత్తినవుంది కూలికి పోయినప్పటికి తన ఒక్క రెక్క ఆడ్డంవలన వచ్చేది సరిపోవడంలేదు పిల్లలు చూస్తే చీమదోమల్లా వున్నారు ముందుగతేమిటో అధ్వాన్నంగా వుంది తనకి ఇక రోజులు సరిగా వెళ్ళేటట్టు లేవు పదిరోజులు ముందే కనుక చేనుకి నీరెక్కినట్లయితే కనీసం పదిబస్తాలు ఎకరానికి రాలేవి ఊరిపెద్దలంతా కూడి నీరు పెద్దరైతులకి వొదిలెయ్యమని తీర్మానించారు "ఎకరాలో క్షేమం పెట్టుకుంటార్రా! పాతికో పరకో వున్నోళ్లకి వదిలెయ్యండి, లేకపోతే అళ్లచేలు ధ్వంసమైపోతై" అన్నాడు పంచాయతీ ప్రెసిడెంటు నాగన్న ఎకరాలవాళ్ల చేలు ధ్వంసమవవు కామోసు పెద్దరైతులకి తిండికి పాత గింజలే వున్నాయి, తనకి నిరుటేడు పండిన గింజలు మూర్కొన్లయినా లేదు, అతరవాత పడ్డ అవస్త ఇంతా అంతా కాదు. ఈయేడు ఏమవబోతుందో! నిరుటేడు తిండిగింజలు అప్పుతెచ్చాడు ఈయేటి పంటలో తీరుస్తానని దానికి వడ్డీకూడా ఇచ్చుకోవాలి ఈయేటిపంట, ఇలా అధ్వాన్నమయింది తను అప్పు తీర్చేదెల్లా? తను బ్రతికి బయటపడేదెల్లా?

ధర్మన్నకి ఏమీపాలు పోవడంలేదు. బోదె పెద్దదవడంవల్ల గట్టు ఎత్తుగా వేస్తున్నాడు వీరన్న చేనుగట్టుమీదనుంచి నడిచి వస్తున్నాడు ధర్మన్న గట్టు వెయ్యడం చూడ్డంతోటే అతడికి కన్నుకుట్టింది తన ఏభై ఎకరాలచేనుకి మళ్లీ ఒకసారి నీరు పెట్టుకున్నట్లయితే బంగారం పండుతుంది ఈ ధర్మన్నగాడు ఇప్పుడే నీరు పెట్టుకోవాలా? తనకి అయిదురోజుల్లో అయిపోతుంది అప్పుడు పెట్టుకో కూడదూ? ఇన్నాళ్ళూ ఎల్లాగా ఆగాడుగా? ఇంకో అయిదురోజులు ఆగరాదూ?

ధర్మన్న దగ్గరకు వచ్చి వీరన్న కర్ర నానుకొని నిలబడ్డాడు "నీళ్లెడుతున్నావేటిరా, ధర్మన్నా?" అన్నాడు ధర్మన్న ఒక్కసారి ఊహాప్రపంచంలోంచి బయటపడ్డాడు. వీరన్నని చూసి "అవునండి" అన్నాడు

"నీవొంతియ్యా లొచ్చిందేటిరా?"

"ఆఁ ఇన్నాళ్లు పేరన్నగా రెట్టుకున్నారు ఇయ్యాళ నే పెట్టుకుంటున్నాను"

"నీ రెండెకరాలకే అంత తొందరొచ్చిందేటిరా?"

"తొందరేంటండీ! ఇప్పటకే ఆలశమయిపోయింది ఇంకా పెట్టకపోతే ధమసమయిపోతాదనండి"

"ఆఁ, ఏడిసింది మా చేలకి పెట్టుకోనీ ఆతరవాత నువ్వెట్టుకొందు గాని" అన్నాడు వీరన్న విషపునవ్వునవ్వుతూ ధర్మన్న ఒక్కసారి నిలువునా నీరయిపోయాడు వీరన్న ప్రెసిడెంటు నాగన్నకి మేనమామ అని గుర్తుకువచ్చి వణికిపోయాడు మంట తడబడింది ఈవొంతు వొదులుకుంటే ఇహ తనకి వొంతురాదు ధర్మన్నకి పెళ్లాం బిడ్డలుగుర్తుకొచ్చారు చూస్తూ మాస్తూ తనువాళ్ల నోట్లో దుమ్ముకొట్టలేడు ఏమయినా సరే ఈ ఎత్తు బడికి లొంగిపోకూడదు మెల్లిగా వొణుకుతున్న గొంతుకతోనే అన్నాడు "ఊఁహుఁ, నాకు రేపైపోతాదండి ఆతరవాత మీరే పెట్టుకొందురు గాని"

వీరన్న వికృతంగా నవ్వాడు "అదపోలేరా ఆతరవాతనే పెట్టుకుంటాను" అని చరచర నడిచిపోయాడు కళ్లువిషాన్ని కక్కుతున్నాయి

ధర్మన్నకి దహతగ్గలేదు ఈ విషపుచ్చి ఏం చేస్తాడో? తన చేనోసారి తడిసిపోయిందిగా? మళ్లా ఎందుకూ? రాకరాక తనకి వొంతువస్తే అది వీడికిచ్చెయ్యాలా? ఇక్కడ పండపోతే వాళ్లతారూర్లో వున్న పాతికెకరాలు పండవూ? అగ్గిచాలదూ వాడు, వాడిపెళ్లాము తిండానికి? తనలా పిల్లా జెల్లా లేరుగా? ఇద్దరు తిండానికేమాత్రం కావాలి? సధవపీనుక్కి దురాశ ఎక్కువ విషపువెధవ, ఏమన్నా నాలుగ్గింజలు రాలితే అప్పు తీరుద్దామని తనువుంటే వీడికి వంతిచ్చెయ్యాలా? తను లేకుండా చూసి గట్టుతీసెయ్యడుకదా? ఏంచేస్తాడో ఏమో! తను సాయంత్రం వేళ ఓకసారివచ్చి చూసుకొని వెళ్ళాలి ధర్మన్న గట్టువెయ్యడం పూర్తిచేసుకొని ఇంటిముఖం పట్టాడు గుండె కొట్టుకుంటూనే వుంది

* * * *

ప్రొద్దుక్రుంకింది పక్షులుగూళ్లు జేరుతున్నాయి ఇళ్లల్లో దీపాలు పెడుతున్నారు పొలాలకు వెళ్లినదూడలు తిరిగివస్తున్నాయి కాపులు పాలు పితుకుకొనివస్తున్నారు ధర్మన్న కూరుకుడిచి బయటకి నడిచాడు గొర్రెపోతు శకునంవచ్చింది ధర్మన్న చేతిలోని కర్రజారింది మనసు శంకపొందింది కాస్సేపు కూచుని మరీబయలుదేరాడు ధర్మన్న మెల్లిగా అడుగులో అడుగు వేసికొంటూ ఊరు మధ్యకు వచ్చాడు రచ్చబండ దగ్గర పెద్దకాపులు చర్చచేస్తున్నారు ధర్మన్న కాస్సేపు కూర్చుందామని చతికిలపడ్డాడు అంతా కలిసి చేలగురించి మాటాడుకున్నారు ధర్మన్న వీలుచిక్కినప్పుడు తనకుతోచింది చెప్పాడు ఊరు మాటుమణిగింది ఒక్కొక్కరే జారుకుంటున్నారు

ధర్మన్న చేను మాసివద్దామని బయలుదేరాడు మెల్లింగా అంగలు వేస్తున్నాడు చెప్పులు కిర్రుమంటున్నాయి కర్రశబ్దం చేస్తోంది గుండె కొట్టుకొంటూ వుంది మధ్యమకాలంలో పీడపోయిందంటోంది మనసు ధర్మన్న చేలగట్టమ్మటబడి తన పొలానికి పోతున్నాడు కీచురాళ్లు గీపెడుతున్నాయి చేలల్లో కప్పలు బెకబెకలాడుతున్నాయి ఇవి తప్ప అంతా నిశ్శబ్దం నిశీథం ఎదురుగావున్న తాటిచెట్లు నీడల్లా కనిపిస్తున్నాయి ధర్మన్న చేను చేరుకున్నాడు మలుపుతిరిగితే అలకు వేసిన గట్టు కనిపిస్తుంది ధర్మన్న గుండె గుబగుబలాడుతూంది ధర్మన్న మలుపుదగ్గరకు వచ్చాడు బోదెలో ఏదో చప్పుడవుతూ వుంది ధర్మన్న తను వేసినగట్టు కేసి ఆగుర్దాగా చూశాడు కళ్లు చీకట్లు కమ్మయి. చరచర నడిచి గట్టుచేరుకున్నాడు తన కళ్లని తానే నమ్మలేకపోయాడు ఎవరో తెల్లని తలపాగా చుట్టుకొని తను వేసినగట్టు తీసేస్తున్నారు ధర్మన్నకి పట్టరాని కోపంవచ్చింది తనవొంతురోజుని తను వేసుకున్న గట్టు తీసెయ్యడానికి వీడెవడు? ధర్మన్నకి వొళ్ళు తెలియలేదు ధర్మాధర్మాలు మరచిపోయాడు చేతిలోవున్న కర్రతో బోదెలోవున్న మనిషిని రెండుబాదులు బాదాడు బోదెలో మనిషి "చంపాడ్రో బాబో" అన్నాడు ధర్మన్న గొంతు స్వరాన్ని గుర్తుపట్టాడు వీరన్న అని తెలిసి ఆశ్చర్యపడ్డాడు తన వేసుకున్న గట్టు తీసెయ్యడానికి ఎంత ధైర్యం! దుర్మార్గుడు

వీరన్న అరుపువిని పొంచివున్న పదుగురు పరుగునవచ్చారు ధర్మన్న ఎదుర్గానే నేలోపుగానే, ధర్మన్నకి తమ ధర్మం నెరపారు "చచ్చానబాబోయ్" "అన్నాడు ధర్మన్న నిలువు నిలువున ధర్మన్నీమాట లేకుండా కూలబడ్డాడు పాపం బాగా దెబ్బలు తిగిలాయి వుంది! వీరన్న విసవిస నడచిపోయాడు పకపక నవ్వుతూ

* * *

రాత్రవిని వూరు భగభగమంది ప్రెసిడెంటు నాగన్న కస్సు బుస్సన్నాడు ఏకోటచూసినా ధర్మన్న వీరన్నని కొట్టాడనే! వీరన్న ధన్నని చావమోదించాడని కాదు! వీరన్న చుట్టాలలో ధర్మన్న మీద కత్తిదూసేవాడ కడు కర్రతీసేవాడ కడూ కలవారిళ్లన్నీ ధర్మన్నని దుమెత్తిపోశాయి ధర్మన్న చుట్టాలు గజగజలాడారు ఖామందులతో నోరు మెదపడానికి వణికిపోయారు ధర్మన్నది ధర్మమయినా ధర్మంపలకడానికి నోరురావడం లేదెవ్వరికీ అందరూ ధర్మన్న యింటికేసి, అతడి పిల్లలకేసి అదోలాచూచేవాళ్లే ప్రతివాడి మనసులోను ఏదో మెదులుతూనే వుంది చాటుచాటున ప్రతీవాళ్లకి ఈ విషయంగురించిన మాటలే ఏం జరుగనున్నదో అని అందరూ ఆతురతగా వున్నారు

ప్రెసిడెంటు నాగన్న ఎవరూ ఫిర్యాదు చెయ్యకుండానే పంచాయితీకి ఊర్లో వాళ్లంతా రావాలసిందని టముకు వేయించాడు ధర్మన్నకి వీరన్నను కొట్టినందుకుగాను సంజాయిషీ ఇచ్చుకొందుకు, శిక్ష అనుభవించడానికి రావలసిందని వెట్టివాడిచేత అధికారయుతంగా కబురుపంపాడు వీరన్న నివచ్చి ఫిర్యాదు చేయమన్నాడు ఊరిలో సంచలనం బయలుదేరింది

దెబ్బలుతిన్న ధర్మన్నని మాలవాడో కడు ఎవరూ చూడకుండా ధన్మన్న ఇంటికి చేర్చాడు, అప్పటినుంచి ధర్మన్నకి స్మృతి లేదు మరునాడు మధ్యాహ్నం వేళకుగాని స్పృహారాలేదు అప్పుడు మెల్లిగా లేచి కొద్దిగా గంజినీళ్లుత్రాగాడు ఇంతలో వెట్టివాడు వచ్చి కబురందించి వెళ్ళాడు కబురందుకున్న ధర్మన్నకిమ్మనలేదు అతడి మనసులో అగ్ని రగుల్కొంది ఇది కలవాడిచర్య అనుకొన్నాడు తనరోజులు మంచివి కావనుకొన్నాడు ప్రత్యక్షదైవం సూర్యనారాయణ చూస్తూనే వున్నాడనుకున్నాడు దైవం తనయందు వుంటే నిజం బయటపడుతుందనుకున్నాడు తీర్పువేళకి లేవడానికి శక్తి లేక పోయినప్పటికి, కూతుర్ని, కొడుకుని

ఊతగా తీసుకుని రచ్చబండ జేరుకున్నాడు తెలిసివుండికూడా ధర్మన్న చుట్టాలు ఎవ్వరూ అతనివెంట పోలేదు వీరన్న ముందుగానే వచ్చి కూర్చున్నాడు. అతడి తరఫు బంధువులంత ఆడవాళ్లసహితం గావచ్చారు వీరన్న ధర్మన్నని చూసిమీసం మెలి వేశాడు

ప్రెసిడెంటు నాగన్న ఊరిపెద్దల్నికూ తీసుకొని వచ్చాడు ధర్మన్నని చూసి పళ్లు పటపట కొరికాడు ధర్మన్న గజగజ వొణుకుతూ మెల్లిగా లేచి దండం పెట్టాడు పిల్లలచేత కూడా పెట్టించాడు

రావలసిన పెద్దలంతా వచ్చారు తీర్పు ప్రారంభమయింది నాగన్న వీరన్నని ఫిర్యాదు చెయ్యమన్నాడు వీరన్న ఫిర్యాదు చేశాడు తాను తనచేనుకి నీరుపెట్టుకొందుకుగాను బోదెలో అడ్డుగావున్న గట్టు తీసేస్తుండగా ధర్మన్న వచ్చి తన్ను కర్రతో కొట్టాడు అని అతడి బంధువులు మెల్లి మెల్లిగా ధర్మన్నని తిట్టడం ప్రారంభించారు ఆడవాళ్లు శాపశతలిచ్చారు నాగన్న ధర్మన్నకేసి తిరిగి సంజాయిషీ ఇచ్చుకోమన్నాడు ధర్మన్న మెల్లిగా లేచి నుంచొని చెప్పడం ప్రారంభించాడు,

"నిన్నా ఇయ్యాళ నీటివొంతు నాకొచ్చిందండి, నిన్నపొద్దున్నేళ యెళ్లిబోదకి గట్టేసుకుంటు న్నానండి ఈ యీరన్నగారు బోదిగట్టు మీదనుంచొస్తూ నన్ను పలకరించారండి నా వంతొదులుకొని ఆరికిచ్చెయ్య మన్నారండి నేనీల్లేదన్నానండి ఆయ నెల్లిపోయారు చీకటడ్డాక, నిన్నరేత్రి చేనుచూసొద్దామని యెల్లానండి ఆచీక బోదెగట్టు యీరుతీస్తున్నారండి అప్పుడీరని తెల్దండి, అప్పుడండి, నా చేతి కర్రతో రెండు దెబ్బలు కొట్టానండి అప్పుడారు అరిచారండి అందాకా తెల్దండియీరని అప్పుగు ఎక్కడ్నుంచొచ్చారో పదిమందిదాకా వుంటారండి కర్రల్తో వొచ్చి నన్ను కొట్టారండి నేను మూల్లేకుండా పడిపోయానండి నాకు తెలివొచ్చే టప్పటికి మాయింటి కాడున్నానండి ఆత తిమ్మదితవరిక తెల్సునకదండీ " అని ముగించాడు

నాగన్న పళ్లు బిగించి తల పంకించాడు ఊరిపెద్దలు తలలు వొంచుకున్నారు. వీరన్న చుట్టాలు "అంతా అబద్ధ" మన్నారు వీరన్న "ఈడికి వొంతెవడిచ్చాడ" న్నాడు చుట్టనములుతూ వీరన్న ధర్మన్ననెవరూ కొట్టలేదన్నాడు తన్నే ధర్మన్న చచ్చేటట్టు కొట్టాడన్నాడు. "ఆడివెళ్లాం స్తలు తెంపెయ్యా కొట్టాడా!" అది వీరన్న పెళ్లాం రొప్పుకుంటూ మిగిలిన ఆడవాళ్లంతా ధర్మన్నమీద మెటికలు విరిచారు అంతా తలోవిధంగా తిట్టారు నాగన్న ఊరిపెద్దల సలహా అడిగాడు అంతా "మీ ఇష్టం" అన్నారు నాగన్న "నీకువొళ్లు పొగరొచ్చిందిరా" అన్నాడు ధర్మన్నని ఎక రాలోళ్లకి నీరు తేనే లేదన్నాడు వొంతులేకుండా నీరు పెట్టుకున్నందుకు జుల్మానా ఇచ్చుకోమన్నాడు పెద్దకాపు మీదచెయి చేసుకున్నందుకు నిన్ను హాత మారుస్తానన్నాడు పళ్లుపటపట కొరికి గుడ్లెర్రజేశాడు ధర్మన్ననోరెత్తలేదు దైవంతనయందు లేడనుకొన్నాడు అంతా తనముప్పుకే వొచ్చిందనుకున్నాడు తొందరపడి చెయ్యిచేసుకున్నాననుకున్నాడు కానీ వీరన్న చేసిన పనికి అతడి మనసు బాధపడింది తనకిన్యాయం జరగడంలేదనుకున్నాడు నాగన్న పక్షపాతం వహిస్తున్నాడని నమ్మాడు ఊరిపెద్దలు నాగన్న నోటకి జడిసి న్యాయంచెప్పడం లేదనుకున్నాడు అంతా తనమీద కక్షకట్టారని తోచిందతనికి

పంచాయితీ గుమాస్తా తీర్పుతయారు చేశాడు నాగన్న అనుమతి ఇవ్వగా ఇలా చదివాడు; "పెదకాపులు ఖామందులు అయిన వీరన్నగారిని ధర్మన్న అధర్మంగా అక్రమంగా అన్యాయంగా కర్రతో చావ మోదాడు నీరు పెద్దరైతులకే వొదిలెయ్యాలని పంచాయితీ ప్రెసిడెంటుగారి తీర్పు వున్నప్పటికి అది లక్ష్యపెట్టక తనపొలానికి నీరుపెట్టుకున్నాడు ఇంకా ఇటువంటివి అతడు ఎన్నో చేశాడు అతడు చేసిన నేరానికి జుల్మానగా తన ఈయేటి పంటనంతట్నీ వీరన్నగారికి సగం పంచాయితీ బోర్డువారికి సగం ఇచ్చేయాలి, ఈ తీర్పుని లెక్కచెయ్యకపోతే అతడి భూములుజప్తు చెయ్యబడతాయని యిందుమూలంగా తెలియజెయ్యడమయింది పంచాయితీ బోర్డుకి కొత్తగావచ్చినఅధికారాలనిఆధారం చేసుకొని ఈ తీర్పు ఇయ్యడమయింది ఇది పంచాయితీ బోర్డు సభ్యుల సమక్షంలో జరిగి, అధ్యక్షుల అనుమతి పొందడమయింది," నాగన్న సంతకం వేశాడు వీరన్న తరఫువాళ్లంతా కన్ను మిన్ను కానక సంతోషించారు ... ధర్మన్న కూలబడి గుడ్లుతేల వేశాడు



# ఎక్కడుంది న్యాయం?

(8-వ పేజీ తరువాయి)

విని రిక్షావాడు ఉలిక్కి పడిలేచి ఏంబాబూ! ఎక్కండి అని అడిగేడు అతనిని, అతని మూటనీ చూసి కూలీ దొరుకుతుందన్న సంతోషంతో "ఏరా! నిద్రబోతు వెధవలు రిక్షా ఎట్లా లాగుతార్రా! కొత్తపేట కెళ్లాలి వస్తావా!" అన్నాడు అతనినిద్ర మత్తును చూసి సందేహంగానే "ఎందుకు రానుబాబూ! ఎక్కండి కొత్తపేటలో ఎక్కడ" కొత్తపేట ఆంజనేయులస్వామి గుడివద్ద అంటూ మూటతోసహా బండిలో కూర్చున్నాడు రిక్షావాడొక్కసారి బద్ధకంగా వొళ్ళువిరిచి "మీ దేబోణీ బాబయ్యా! యింతకాలం చలికాలం కావడంవల్లనో ఏమో! కూలీ దొరకలేదన్నాడు దానికి బండిలోని వ్యక్తినుండి జవాబు రాలేదు మళ్లీ ప్రారంభించాడు 'కొత్తపేట కెళ్లవలసినవారు బెజవాడలో దిగితే దగ్గరకదా! యిక్కడ డెంగుకు దిగారు బాబూ!" "ఎందుకేమిటి నీమొగంపొట్టకూటికి తంటాలు అక్కడ యీమూటతో దిగితే రేవనోళ్లు, పోలీసోళ్లు తయారు" దానితో రిక్షావాడి కర్థమయింది సత్యన్నారాయణపురంలో ఎందుకు దిగాడో అతనివద్ద బియ్యపుమూట వున్నదని రిక్షావాడు యింకేమీ మాట్లాడకుండా, విసురుగానే బండిని నడుపుతున్నాడు బండిలాగే వేగానికి చలి మరీ ఎక్కువగావుంది శరీరాన్ని కత్తితో కోస్తున్నట్లుంది "తొందరగా లాగాల్రా" అన్నాడు బండిలోని వ్యక్తి సరేనన్నట్లు బండినింకా విసురుగా లాగుతున్నాడు కష్టానికి తగిన కూలి యివ్వక పోతాడా అని బండిలో బ్రిడ్జిదాటి పోస్టాఫీసు సందుగుండా పోతూవుంది "ఏయ్ రిక్షా" అన్నకేక విని రిక్షా వాడాగి "ఎవడో పోలీసులా గున్నాడు బాబయ్యా' దానితో గుండె ఒక్కసారి ఆగినంత పనయింది లోపలివ్యక్తికి కేకవేసిన వ్యక్తిదగ్గరకు వస్తూ మూటనీ, మనిషినీ చూసి ఏయ్! యింతరాత్రప్పుడు ఎక్కడ్నుంచి తెస్తున్నావ్ యీబియ్యం దొంగవెధవలు ఎన్నిసార్లు చెప్పినా బుద్ధిలేదు. పద స్టేషనుకు" "రక్షించాలి ఏదో తిండికి తెచ్చుకుంటున్నాను. అమ్మడానికి కాదు బాబూ!" "ఈ పాటా లెవరికి తెలియవులే పద స్టేషనుకి అక్కడ చెప్పుకుందువుగాని "మీరూ అట్లాంటే ఎట్లాబాబూ!" అంతలో యింకొక వ్యక్తి అక్కడకు చేరాడు వచ్చినవ్యక్తి "ఏదో! తిండి గింజలంట పోనీయండి! ఏదో యిచ్చుకుంటాడులే" అన్నాడు పోలీసు కొంత మెత్తబడి "వీళ్లను యిట్లా పోనీలే అని విడిచిపెడ్తే, అందరికీ యిదేవ్యాపారమైపోయింది "పోనిస్తురూ! మీరు స్టేషనుకు తీసుకువెళ్తే ఒక్క కాణీ రాదుమీకు ఏదో యిస్తాడు పాపం! మీరుకూడ రాత్రుళ్లు చలనక తిరుగుతున్నారు ఆమాత్రం ముట్టజెప్పకపోడు ఏదో యిచ్చి పంపే" యన్నాడు రిక్షాలో కూర్చున్న వ్యక్తితో పెద్దన్యాయమూర్తిలాగ వెంటనే మొలనుండి రూపాయితీసి పోలీసుచేతిలో పెట్టాడు "ఇదేంటి! నేనేం అడుక్కుంటున్నాననుకున్నావా! "అదేంటయ్యా రూపాయి కూరకేచాలదు ఏదో తగినంత యియ్యాలికాని ఆయనే స్టేషనుకు తీసుకుపోయాడంటే జుల్మానా పడుతుంది ఇంకోరూపాయిచ్చేయ్ అనగానే వెంటనే యింకోరూపా యివ్వగానే యిద్దరూ వెళ్లిపోయారు "పోనీలేరా! చెరో రూపాయి దొరికింది అన్నమాటలు రిక్షావాని చెవుల్లో బడ్డాయి "లోకంలో ఎంత మోసం జరుగుతుంది న్యాయానికి నిజాయితీకి రోజులుకావు" అనుకున్నాడా రిక్షావాడు కండ్లవెంబడి వచ్చేనిద్రను, ఆవులింతలద్వారా ఆపుకుంటూ, వేడిగా శ్వాస పీలుస్తూ బండిని బలంగా లాగుతున్నాడు ఆంజనేయస్వామి గుడివచ్చింది" ఆపు యింటిదగ్గర "అనగానే రిక్షా ఆగింది మూటనుతీసి రిక్షావాడు గుమ్మంలో పెట్టాడు ఒకరూపాయి డబ్బులైనా యిస్తాడని ఆశతో చూస్తున్నాడా రిక్షావాడు కాని ఆవ్యక్తి లెక్కపెట్టి, మూడుబేడ కాసులు రిక్షావాని చేతిలో పెట్టగానే రిక్షావానికి ఒక్కసారి కూలిపోయినంత పనయింది "ఇదేంటి బాబయ్యా! ఇంత చలిలో, యింతదూరం, యింతరాత్రప్పుడు వచ్చానే, అరణాలా బాబయ్యా! కష్టానికి తగిన కూలి గాదు బాబూ! ముప్పావలాన్నా యివ్వండి" "ముప్పావలా! రూపాయా! మీ రిక్షావాళ్లు చాలా పొగరెక్కి ఏడుస్తున్నారు ఏదో రాత్రిగదా! అని ఆర్ణాలిచ్చాను పగలైతే పావలే ఫో" అంటూ కసిరికొట్టి లోపలికి వెళ్లిపోయాడు రిక్షావాడు బిక్కమొగం వేసి "ఎవడో పోలీసువాడొచ్చి డబాయించగానే రెండురూపాయిలు తీసియిచ్చాడు ఇంతకష్టపడ్డ నాకు ఆరణాలు ఎక్కడుంది న్యాయం ఈకాలంలో న్యాయానికి కూడులేదు" అనుకుంటూ వెళ్లిపోయాడు



## గల్పిక:




రాత్రి పదిగంటలైంది నాన్నగారు భోజనంచేసి ప్రక్కింటాయనతో మాట్లాడుతున్నారు నేను గదిలో పడుకొని నిద్రరాక కునికిపాట్లు పడుతున్నాను

'అయ్యా! ఆకలి!' అనే కేక వినబడింది

ఆ బిచ్చగాడికి చాలా ఆయాసంగా ఉన్నట్టుంది కానీ అదినిజంగా ఆయాసమో లేక వాడినటనా కౌశలమో నే నూహించుకోలేక పోయాను

'అందరూ దీపాలుమలి పేసి నిద్రగూడా పోయార్రా పోపో' అన్నారు నాన్నగారు ఆయన అన్నట్లుగా మా అమ్మ గూడా పెరట్లో ఆరుబయట పండుకొని నిద్రపోతున్నది

'బాబూ! చాలా ఆకలిగాఉంది కనికరించండిదొరా!' ఈ సారి బిచ్చగాడి కంఠంలో దైన్యం స్పష్టగా కన్పిస్తున్నది

మా నాన్న గారు మెత్తబడ్డట్లున్నారు గాని పొరుగింటాయిన చాలా చిరాకు పడ్డాడు అసలువిషయం ఏమంటే ఆయనకు, బిచ్చగాళ్ళకు జన్మజన్మాంతర విరోధం! తెల్లవారుఝామునే వచ్చితనకు నిద్రాభంగం చేశాడన్న కోపంమీద ఆయన బుడబుక్కలవాణ్ణి ఊరిమొగసాల వరకు తరిమి ఇంకా రెండుమూడు రోజులుగూడా కాలేదు ఈ దఫా ఆయన తనఫాల నేత్రాన్ని ఈ అభాగ్యుడి మీదికి తెరుస్తాడేమోనని నాకు భయంవేసింది

'ఛీ! పోరా, దొంగవెధవా! అర్ధరాత్రయ్యింది ఇప్పుడువచ్చి అన్నం అడిగితే నీకోసం ఎవరైనా వండిపెట్టుకుని, వేచుకొని కూచొన్నారా? పో పో'

ప్రక్కింటాయన బిచ్చగాణ్ణి ఏకధాటిగా తిట్టడం సాగించాడు వాడు దేశద్రోహం చేస్తున్నాట్ట వీలైతే ఇటువంటి వాళ్ళు దొంగతనాలుగూడా చేస్తారట!

ఈ బిచ్చగాడి హడావుడిలో నాకింక నిద్రరావడం కల్లగాబట్టి, చల్లగా గాలైనా వస్తుందని బయటికివచ్చాను బిచ్చగాడు ప్రక్కింటాయన్ని నిర్లక్ష్యగా చూస్తూ అక్కడే నిలబడి ఉన్నాడు

తిట్టి, తిట్టి నోరునొప్పెట్టిన తర్వాత ప్రక్కింటాయన వీరభద్రావతారంతో బిచ్చగాడి దగ్గరకులంఘించి 'పోరా, పోరా' అని అరిచాడు వాడుకదల్లేదు సరిగదా ఇసుమంతకూడా చలించకుండా క్రిందకూలబడి 'నేనుపోను, పోను' అని ఊరంతా వినబడేట్టు అరిచాడు

ఈ ధిక్కారాన్ని చూచి నేనాశ్చర్యపడ్డాను మా నాన్నగారికి నోటమాట రాలేదు పొరుగింటాయన మాత్రం రెండింతలుగా విజృంభించి 'పోవా? పొకేంజేస్తావురా, చవటా?' అన్నాడు పండ్లు కొరుకుతూ

బిచ్చగాడు తొణకకుండా, శాంతగంభీర మూర్తియైన కథానాయకుని పోజులో 'నిన్న ఈ ప్రక్క ఊర్లో గూడా ఈ మాదిరే అన్నంలేదు పొమ్మన్నారు నే నేంచేశానో తెలుసా? ఊరివాళ్ళంతా హడలిపోయారు న్యాయంగా పెట్టెడన్నం వేస్తే వేయండి లేకపోతే ''

పొరుగింటాయనకు పిచ్చేపట్టి పోయేట్టుంది ఏంచేయడానికి తోచక ఆయన అప్రతిభుడై నిలచిపోయాడు నాన్నగారికి ఈ పీడనెట్లాగయిన వదల్చుకోవాలనిపించింది ఆయన ఇంట్లోకివెళ్ళి అమ్మను లేపి కుండలో మిగిలిన పట్టెడన్నాన్ని బిచ్చగాడికి వేయించాడు వాడు నిదానంగా అన్నంతిని, నీళ్ళు తెమ్మని త్రాగి గుమ్మందాటి వెళ్ళిపోయాడు

రెండుక్షణాలు అందరం నిశ్చేష్టులంగా వాణ్ణిచూస్తూ నిలబడిపోయాం తరవాత నేను చరచరా వెళ్ళివాణ్ణి వెంబడించాను వాడు గ్రామచావిడి దాటుకొని రోడ్డులో కలసుకొంటున్నాడు నే వాణ్ణి ఒకే ఆనిపిలిచి 'ప్రక్క ఊర్లోవాళ్ళు నీకు అన్నంవేయనన్నారుగదా నీవేంచేశావో చెప్పూ' అన్నాను

వాడు చిన్నవవ్వునవ్వి 'నిజం చెప్పమన్నారా? అపద్దం చెప్పమన్నారా?' అన్నాడు 'నిజమేచెప్పరా' అన్నాను

'అన్నంవేయమని ఎంతో వేడుకొన్నాను. వాళ్ళు వేయలా నే నేంచేశానో తెలుసునా, బాబూ! ఆకలితో మాడేకడుపును అరచేత్తోపట్టుకొని నిండుపస్తుబడిచచ్చాను' అని తిరిగిచూడకుండా వెళ్ళిపోయాడు బిచ్చగాడు.



---

"నాన్నా, నక్షత్రాలెంత దూరంలో ఉన్నాయి?"

"నాకు తెలీదురా"

"చూశావా, నాన్నా? నీ తెలివి తక్కువవల్ల రేపు నేను క్లాసులో దెబ్బలు తినాలి"

* * * *

"నా మంగలికత్తి గొరగగ దేం?"

"మరీ చోద్యమండీ? మీ గడ్డం పెనసలుకన్న బిరుసా ఏం?"

సీరియల్ నవల :

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

అలెగ్జాండర్ డ్యూమా

## 40

"ఇప్పుడు వచ్చే అతిథు లెవరు?" అని అడిగాడు బోశాంప్, పత్రికాధిపతి

"ఒక రాజకీయవేత్త, ఒక పెద్దమనిషి"

"పెద్దమనిషికోసం రెండుగంటలు, రాజకీయవేత్తకోసం మూడుగంటలు కనిపెట్టుకుని ఉండడం మామూలే అయితే నేను వెళ్లి నా పనిచూసుకుని వస్తాను నాకోసం ఏమైనా కొంచెం మిగిల్చి ఉంచు"

"అక్కర్లేదు నువ్వు చెప్పినవాళ్లమాదిరయితే అలా ఉంచవలసిందేకాని ఇప్పుడా భయంలేదులే ఈలోగా బిస్కట్లు తిని మద్యం చప్పరిస్తూ ఉండు" అన్నాడు ఆల్బర్ట్

"అయితేసరే ఉంటాను నాకు ఆలోచనల్తో బుర్ర చికాకెత్తిపోతోంది ఇవాళ నేం చెయ్యాలో తెలుసా? డిప్యూటీల సభలో డాంగ్లర్ మాట్లాడతారు అది వినాలి సాయంకాలం వారి భార్య సోది వినాలి"

"డాంగ్లర్ ఉపన్యాసాల్ని ఆక్షే అచ్చువెయ్యకు తగ్గించెయ్యి ఆయన ప్రతికూలపక్షానికి చెందినవాడు అంటే అదంతా మీ గొడవేగా?"

"అసలున్న చిక్కు అదే నువ్వు ఆయన్ని లక్జెంబర్గ్ పంపించు ఉపన్యాసాలు దంచడానికి మనమంతా కులాసాగా కూచుని నవ్వుకోవచ్చు"

ఆల్బర్ట్ బోశాంప్‌తో ఇలా అన్నాడు "పాపం స్పెయిన్ గొడవలన్నీ మసిగిపోయినట్లున్నాయి అందువల్లే నువ్వు అంత చలాకీగా లేవు అయినా, డాంగ్లర్ కుమార్తెకీ నాకూ వివాహం జరుగుతుందని పారిస్‌లో పుకార్లు జోరుగా ఉన్నాయని మరిచిపోకు తన కూతుర్ని ఎనభైవేల పౌనుల్తో సహా నాకిచ్చే పెద్దమనిషి ఉపన్యాసాల్ని నువ్వు తగ్గించేస్తానంటే నే నెలా ఊరుకుంటాను?"

"ఆ! ఈపెళ్లి అయేదికాదులే" అన్నాడు బోశాంప్ "డాంగ్లర్‌కి మహారాజు బారన్ బిరుదిచ్చారు ఇంకో మెట్టు పైకి కూడా ఆయన్ని ఎక్కించవచ్చు కాని మంచివాణ్ని మాత్రం చెయ్యలేరుకదా! ఎనభైవల పౌనులకోసం మీతండ్రి తక్కువ సంబంధానికొప్పుకోరు నువ్వు ఎవరో మార్క్వెస్ కూతుర్ని పెళ్ళిచేసుకోవాలని ఆయన ఉద్దేశం"

"కాని ఎనభైవేలంటే తక్కువకాదోయ్" అన్నాడు ఆల్బర్ట్

డిబ్రే ఇలా అన్నాడు: "అతను చెప్పినమాట వినకోయ్ ఆల్బర్ట్ డాంగ్లర్ కూతుర్ని పెళ్ళిచేసుకో బంగారంకోసం టిక్కెట్టు కొనుక్కున్నాననుకో అందులో తప్పేముంది? మహారాజుగారి పతకాలు తక్కువున్నా ఇబ్బందిలేదు కాని, ధన లోపం ఉండకూడదు"

"నువ్వు చెప్పిందే బాగున్నట్టుంది" అన్నాడు ఆల్బర్ట్ డిబ్రేతో

ఇంతలో చాతో రీనా, మాక్సిమిలియన్ మారెల్ వచ్చారు. మొదటివ్యక్తి వయస్సు ముప్పైఏళ్లుంటుంది ఇలా అన్నాడు "ఆల్బర్ట్! వీరు కెప్టెన్ మారెల్ ఒకసారి నా ప్రాణం కాపాడిన శూరుడు నా ప్రాణమిత్రుడు" ఆల్బర్ట్, మారెల్ కరచాలనం చేశారు మాక్సిమిలియన్ మారెల్ చక్కని దేహపుష్టికల యువకుడు ఎత్తైనవాడు విశాలమైన నుదురు, చురుకైన కళ్లు, ఆహ్లాదం చిలికే ముఖం, ఉత్కృష్ట గుణసంపదను వ్యక్తం చేస్తాయి సైనికాధికారిదుస్తులు ధరించాడు లీజన్ ఆఫ్ ఆనర్ పతకంతో పాటు ఇతర పతకా లనేకం ధరించాడు ఆల్బర్ట్ ప్రీతిపూర్వకంగా చిరునవ్వు నవ్వి, "మీరు నా మిత్రునికి ప్రాణమిత్రులు, నన్ను కూడా మీ మిత్రునిగా ఎంచండి" అన్నాడు

"బాగా చెప్పావు" అన్నాడు చాతో రీనా "నువ్వు కూడా నా మాదిరిగా ఎప్పుడైనా చిక్కులో పడినప్పుడు, నాకు చేసిన ఉపకారమే ఆయన నీకూ చెయ్యగలరు"

"ఆయనేం ఉపకారం చేశారు?" అని అడిగాడు ఆల్బర్ట్

"అబ్బే! అదేమంత చెప్పుకోదగింది కాదండి" అన్నాడు మారెల్

"చెప్పుకోతగింది కాదూ? ప్రాణం అంత విలువలేనిదా?" అన్నాడు చాతో రీనా

"ఆయన నీ ప్రాణాల్ని కాపాడారా?"

"అవును"

"ఎలాగ?" అన్నాడు బోశాంప్

"నాకు ఆఫ్రికా వెళ్లడం ఎప్పుడూ సరదా అని మీకు తెలుసుగా! ముందు అల్జీరియా వెళ్లి, తరవాత కాన్‌స్టాంటిన్ నగరం వెళ్లాను అప్పుడే ఆ నగరంపైన ముట్టడి ఆఖరవుతోంది సైనికులందరితోపాటూ నేను కూడా వెనకదారిపట్టి రెండురోజులు ప్రయాణం చేశాను పగలు వానల్లోనూ, రాత్రి చలిలోనూ రెండు రోజులూ నానాయాతనలూ పడ్డాను మూడోరోజు పొద్దున్న నా గుర్రం చలికాగలేక చచ్చిపోయింది ఆపైన కాలినడక ప్రారంభించాను ఒకచోట ఆరుగురు అరబ్బీలువచ్చి మీదపడ్డారు తుపాకితో ఇద్దర్ని, పిస్తోలుతో ఇద్దర్ని చంపేశాను కాని మిగిలిన ఇద్దరూ నన్ను పట్టుకుని తుపాకి, పిస్తోలూ లాక్కున్నారు ఒకడు నా జుట్టు గట్టిగా పట్టుకున్నాడు—అప్పటినించీ ఎన్నడూ జుట్టు పొట్టిగా కత్తిరించేసుకుంటున్నాలే—రెండోవాడు నన్ను గొంతుక పట్టుకుని కత్తిఎత్తాడు ఆ సమయంలో ఈయనవచ్చి ఒకణ్ణి పిస్తోలుతో కాల్చి చంపేశాడు రెండోవాణ్ని కత్తితో నరికేశాడు ఆ రోజున ఒక ప్రాణిని రక్షించాలని దీక్ష పెట్టుకున్నా

అనువాదం: సీతారామ్

రట సరే, నేను దొరికాను అది కేవలం అదృష్టం నేను డబ్బు సంపాదించినప్పుడు తప్పకుండా అదృష్టదేవతవిగ్రహంనిర్మిస్తాను ”

“అవునండి” అన్నాడు మారెల్ “ఆరోజు సెప్టెంబర్ 5 వ తేదీ ఆ రోజునే నా తండ్రిని ఎవరో అజ్ఞాతంగా ఉండి కాపాడారు అందువల్ల ప్రతిసంవత్సరం ఆ తేదీని ఏదో ”

“సాహసం, ఉపకారం చేస్తారు” అని పూర్తిచేశాడు చాతోరీనా “ఆరోజుని నేను దొరికాను అంతేకాదు చలిబాధలో నేను చచ్చిపోవలసిందే కాని అప్పుడు కూడా నన్ను రక్షించారు ఎవరో మహర్షి ఎవరో చలిలో చచ్చిపోతోంటే తన పచ్చడం వాడి కూడా కప్పి రక్షించాడుట ఈయన అలా కూడా చెయ్యలేగు తన ఉన్ని కోటు నా కిచ్చేశాడు తరవాత ఆకలిబాధనించి ఎలా రక్షించారో తెలుసా ? ఊహించండి !”

“రొట్టి ఇచ్చారా ?”

“అబ్బే ! తన గుర్రాన్ని చంపేశారు దాన్ని ఇద్దరం కలిసి తిన్నాం ”

“గుర్రాన్నా ?” అన్నాడు ఆల్బర్ట్ నవ్వుతూ

“అవును డిబ్రేని అడుగు అటువంటి అవసరంలో తన తెల్ల గుర్రాన్ని చంపి ముక్కు మొహం తెలియని కొత్తవాడి కిస్తాడేమో ?”

“కొత్తవాడి కివ్వను స్నేహితునికోసమైతే ఇస్తాను ”

“ఇప్పుడు మాత్రం పోయిందేముంది ! మనిద్దరం స్నేహితుల మవుదాం” అన్నాడు మారెల్. “అదలా ఉండ నివ్వండి సాహసమనండి, త్యాగమనండి, అదృష్టదేవత మాకు ప్రసాదించిన భాగ్యాన్ని గుర్తుంచుకుని ప్రతీయేటా ఆరోజున త్యాగంచేసితీరాలని నా ప్రతిజ్ఞ ”

“మారెల్ చరిత్ర అద్భుతమైనదిలెండి” అన్నాడు చాతోరీనా తరవాత చెప్పవచ్చు అది ఇవాళ పుష్టిగా తిందాం ఎన్ని గంటలకోయ్ విందు ?”

“పదిన్నరకి ఆపైన అయిదునిమిషాలు చూదాం నన్ను కూడా రక్షించిన ఒక వ్యక్తి ఇప్పుడు రావాలి మనవంటివాళ్లని చంపడానికి అరబ్బీలే అక్కర్లేదు అనేకమంది ఉంటారు ఇవాళ మన విందు చాలా గొప్పదన్నమాట మానవసేవ చేస్తున్న ఇద్దరు ఉత్కృష్టవ్యక్తులీ విందులో ఉంటారు ”

“ఆయనది ఏ దేశం ?” అన్నాడు డిబ్రే

“నిజంగా నాకు తెలియదు” అన్నాడు ఆల్బర్ట్ “మూడుమాసాలకిందట ఆయన్ని ఆహ్వానించినప్పుడు రోమ్‌లో ఉన్నాడు ఆ తరవాత ఏ దేశం వెళ్లాడో ఎవరికి తెలుసు ?”

“ఆయన సరిగ్గా వేళకి రాగలడని నీకు నమ్మకమేనా ?” అన్నాడు డిబ్రే

“ఆయనకి సాధ్యంకాని దేదీలేదని నా నమ్మకం ”

“అయితే అయిగునిమిషాలు ఆలస్యాని కొప్పుకున్నా, ఇంక పదినిమిషాలే గడువుంది ”

“ఈ పదినిమిషాల్లోనూ ఆయన్ని గురించి చెప్తాను వినండి మొన్నటి ఉత్సవాల్లో నేను రోమ్‌లో ఉన్నప్పుడు, నన్ను దొంగలు పట్టుకుని సెంట్ సెబాస్టిన్ శ్మశానవాటికల్లోకి తీసుకుపోయి నిర్బంధించారు నాలుగువేల స్పానిష్ డాలర్లు చెల్లిస్తేనే నన్ను విడిచిపెడతారనీ, లేకపోతే మరునాడు పొద్దున్నే నన్ను తలతెగవేస్తారనీ చెప్పారు అప్పటికి నా డబ్బులో చాలావరకు ఆఖరు కొవచ్చింది ఫ్రాంజ్ కి ఈవిషయం ఉత్తరంవ్రాస పంపాను ఫ్రాంజ్ ఆ కొత్తమిత్రునితో కలిసివచ్చాడు. సరిగ్గా ఆయన నాఅంతే ఉంటాడు ఆయన రెండుమాటలు చెప్పాడో లేదో వెంటనే దొంగలు నన్ను విడిచిపెట్టేశారు ఆ కొత్త మిత్రుడే ఇప్పుడు రావాలి ”

“నిన్ను పట్టుకున్నందుకు ఆయనకి దొంగలు క్షమార్పణ అడిగారు కూడానా ?”

“అడిగారు ఆయన పేరు కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో ”

“మాంట్ క్రిస్టో ద్వీపానికి కౌంట్ లేడే ?” అన్నాడు డిబ్రే

“నేను కూడా విన్నాను ఆయన్ని గురించి” అన్నాడు మాక్సిమిలియన్ మారెల్ “మా తండ్రిగారివద్ద పనిచేసిన నావికులు మాంట్ క్రిస్టో ద్వీపాన్ని గురించి చెప్పేవారు ”

“అదే ఆయన ఆ ద్వీపానికి సర్వాధిపతి టస్కనీప్రభుత్వం వద్దనుంచి ఆ ద్వీపాన్నీ బిరుదునీ కొన్నాడు ”

“పెద్ద భాగ్యవంతుడా ?”

“నువ్వు అరేబియన్ నైట్స్ కథలు చదివావా ?”

“బలే ప్రశ్న అడిగావు ”

“ఆ కథలో మనుషుల్ని చూస్తే భాగ్యవంతులో పేదవాళ్లో చెప్పగలవా ? వాళ్ళ బస్తాలలో గోధుమపిండే ఉందో, గత్నాలే ఉన్నాయో ఎవరైనా చెప్పగలరా ? పైకి పేద పల్లకౌరుల మాదిరిగా కనిపిస్తారని కాదూ వ్రాశారు ? ఉండండి ఒక గుహాతలుపు తెరిచేసరికి ప్రపంచంలోని సకల సంపదలూ అక్కడుండేవిట ఈయనకూడా అటువంట భాగ్యముంది అటువంటి పేరే పెట్టుకున్నాడు—సింద్‌బాద్ ఆయనగుహానిండా బంగారంఉంటుంది

మారెల్ కొంత యోచనాశక్తితో ఇలా అన్నాడు “నేను కూడా ఇదేమాదిరి కథ పెనిలన్ అనే వృద్ధనావికుడు చెప్పగా విన్నాను ”

“అదుగో విన్నారా ?” అన్నాడు ఆల్బర్ట్ “మారెల్ కూడా నేను చెప్పింది నిజమంటున్నారు మీ రెవ్వరూ నమ్మటం లేదు కాదూ ? ఆయన నామాట సమర్థించటం ఎందుకు నచ్చడం లేదు ”

డిబ్రే ఇలా అన్నాడు “ఆల్బర్ట్, నువ్వు చెప్తున్నది మరీ వింతగా ఉంది కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో మనిషైతే ఉండొచ్చుననుకో ”

“అరె ! మనందరిమాదిరిగానే ఆయనా ఉన్నాడు ఒట్టు!”

“మనమాదిరిగానే భోజనంకూడా చేస్తాడా ?”

“చేస్తాడు కాని బహుకొద్ది అది భోజనం అనకూడదు ”

“అయితే భూతమన్నమాట ”

“పరిహాసంగా ఉంటే నువ్వు నవ్వుకో కాం [illegible]— కూడా నీలాగే అంగి ”

“భయంకరమైన కళ్లు, అనుకున్నప్పుడల్లా చిన్నవీ, పెద్దవీ ఔతాయికాదూ ? ముఖం కోలగా ఉంటుంది విశాలమైన నుదురు, తెల్లగా పాలిపోయిన ముఖం, నల్లని గడ్డం, చిన్నవి తెల్లని పదునైన పళ్లు, లార్డ్ బైరన్ వ్రాసినట్లు ఉంటాడుకాదూ ? మాట మన్ననలో ఆ మనిషి తరవాతనే ఇంకొకర్ని చెప్పాలి అంతేనా ?”

“సరిగా అంతే ఇటు విను డిబ్రే” అన్నాడు ఆల్బర్ట్ “ఇప్పుడు నువ్వు వర్ణించినట్లే అన్ని లక్షణాలూ ఉంటాయి మాటలాడేటప్పుడు గవంతైనా పొరబడడు. సున్నిత, మర్యాద ఉట్టిపడుతుంటాయి చాలసార్లు అతన్ని పరీక్షగా చూశాను వొణుకుపుట్టేది ఒకరోజున ఒకణ్ణి ఉరితియ్యటం చూసి అ చూసినందుకు కాదుగాని, ఆయన స్థిరకంఠంతో మెల్లిగా హింస

(26-వ పేజీ చూడండి)



ఆయింట్లోకి ఒక పెద్ద కుటుంబం వచ్చి దిగింది మొత్తం పదిహేను మంది జనం ఎప్పుడూ పెళ్లివారిల్లులా సందడిగావుంటుంది ఆకుటుంబానికి పెద్దావిడ రామలక్ష్మమ్మ ఆవిడ ఇద్దరు కొడుకులు కోడళ్లు ఆడ బడుచులు అంతా ఆకుటుంబ జనం

ఇంతమంది జనంతో ఆయిల్లు ప్రశాంతంగా నిశ్శబ్దంగా వుంటుందని ఎలాగనుకోగలం? ఎప్పుడూ ఏవో తీరని కోరికలతో కయ్యాలు, కయ్యాలింపులు ఆయింటి పెదకోడలు సీతమ్మ పేరు మరీ చంపేసు పుట్టింది ఇంక చిన్నకోడలు చిన్నమ్మ కయ్యానికి కాలు దువ్వుతుంది నెయ్యానికి రాళ్లు రువ్వుతుంది ఇంతకు చిన్న కోడలిపైనే అత్తగారు ఆడ బడుచులు చేరుతారు చెప్ప వచ్చేదేమంటే పెద్ద కోడలు ఒక్కతే ఒంటి పులి రాకాసి తన భర్త తన దగ్గరకే రావడానికి భయపడతాడు ఇక అసలే కన్నెత్తయినా చూడు

ఇంక రామలక్ష్మమ్మ కొడుకుల సంగతి ఎత్తుకుంటే ఉత్తరదక్షిణ ధ్రువాల్ని పోలిక లేవాలి ఇదరూ ఈవిడ కడుపునే పుట్టారా? అన్న అనుమానం తప్పక కల్గుతుంది పెదకొడుకు సూర్యరావు చిన్నికొడుకు సుబ్బారావుకు ఒక్క పోలిక లేదు చిన్నతనంలో ఎలాగుంటే వారో గాని? కలువపూవు తమ్మిపూవుల్లా ఆ జన్మవైరుధ్యమూ అన్నట్లు ఎడమొగాలు పెడమొగాలే! ఎప్పుడూ వాళ్లిదరు ఆప్యాయంగా 'అన్నా తమ్ముడూ' అని పిలుచుకుని సౌదర్యం ప్రకటించిన పాపాన పోలేదు సూర్యరావు గొడవ, సూర్యరావుది, సుబ్బారావు గొడవ సుబ్బారావుది

'మాడంపుడ్రా! మీ భార్యలిద్దరు తగవులాడుకుంటూంటె, చూస్తూవూరుకుంటారేమిరా? మందలించకపోతే ఎలాగరా,' అని రామలక్ష్మమ్మ అంటే 'ఏం వాళ్ల కోసం మమ్మల్ని కూడా కలబడమంటావా? ఆడవాళ్లకు మతీ మానం లేకపోతే సరి' అన్నాడు సూర్యరావు

ఆవేళ పెద్ద రణగోల అయింది బజారు బజారంతా పోగేగి పోయింది ఇంటి పెంకులు చిట్లి పోయాయా? అనుకున్నారు సీతమ్మను గురించి చిన్నమ్మ ఏదో సణిగిందట అత్తగార్లు కూడాబాగా 'తందానా తానా' అన్నారట 'ఈలాంటి గయ్యాళిముండను ఏ మొగుడు చూస్తాడు బాగా అయింది పెటకం' అని చిన్నమ్మ

ఈ మాటలు సీతమ్మ చెవిలో పడేటప్పటికి ఆరు నెలల్నించి రాజుకుంటూన్న అగ్నిగోళం ఒక్కుమ్మడి ఆశాంతరాళాలు అగిలిపోయేట్టు పెటిల్లుమంది

'నువ్వే గయ్యాళిముండవి నీ మొగుడే గయ్యాళి వెధవ మిమ్మల్ని నేకాటిలో చూడాలి మీ మొగుళ్లు చూసిపోవాలి' అంటూ సీతమ్మ రేగిపోయింది

ఇంక పెద్దకోడలు ఒక్కటే ఒకతెగా, తక్కినవాళ్లు అందరూ ఒకటిగా పోరాటం కొనసాగింది

'నన్ను చంపేస్తున్నారు బాబోయ్'

'నాగొంతు పిసికేస్తున్నారు బాబోయ్'

అంటూ సీతమ్మ ఇవతలికి వచ్చిపడింది మిత్రమండలిచే ఓటమి తిని నలుగుర్లో పడిపోయింది అత్తా ఆడుబడుచులు, చిన్నకోడల మిత్రమండలి ఇంకా సీతమ్మను ఇంటి సరిహద్దులు దాటిపోయేట్టు కొట్టారు

(21-వ పేజీ చూడండి)




మా పొలం తిరిగి కట్టుబడి కెళ్ళ డానికి మా వూరు వెళ్లాను. మా వూళ్లో శేషయ్య తాతంటే నా కెందుకో అపరిమితమైన యిష్టం. నేను ఎప్పుడు వెళ్లినా అక్కడున్న కొన్నేపు ఆయనతో గడిపేవాడిని. శేషయ్య తాత తన జీవితంలో అనుభవాలు ఎన్నో స్మరణకు తెచ్చుకుని అవన్నీ అభిమానంతో నాకు చెబుతూ ఉండేవాడు. ఆయన "పింఛనీ" పుచ్చుకున్న పోలీసు సబిన్‌స్పెక్టరు. వందలకొలది కథలు చెప్పేవాడు.

ఆ రోజున రాముల వారి గుడిదగ్గర అందరం జేరాము. నన్ను పట్నం కబుర్లడిగారు కొంతమంది. ఎప్పాపాట్లీ అన్నీ అయిపోయేటప్పటికి రాత్రి పదిగంటలయింది.

"శేషయ్య తాతా, నీ నోటితో కథ విని చాలకాలమయింది. ఒక కథ చెప్పూ" అని అడిగాడు.

"నాయనా, ఎంతోమందికి ఎన్నో అనుభవాలు చెప్పాను. పోలీసు ఉద్యోగి జీవితమంతా వింత విపరీత కథ. ఇదివరకెన్నడూ ఎవరికీ చెప్పలేదు ఈ కథ. చెప్పకూడదనుకున్నాను. ఇన్నాళ్లుగా నిన్నెరుగుండబట్టి, ఆప్యాయంగా అడుగుతున్నావు కాబట్టి చెప్పాలనిపిస్తోంది విను" అని మొదలు పెట్టాడు.

"నేను కొత్తగా పోలీసుపనిలో చే[illegible] రోజులవి. ట్రెయినింగు అయిపోయిం[illegible] ఒక రెండు నెలలు అటూయిటూ పంపి మన్యం బదిలీ చేశారు. నాకు మన్యం వెళ్లడం యిష్టంలేదు. అక్కడ విషజ్వరాలొస్తాయని బోదకాళ్లొస్తాయని అక్కడకు వెళ్లడానికి భయపడ్డాను. కాని నాకు తప్పలేదు. అక్కడికి వెళ్లడమో ఉద్యోగం మానుకోడమో జరగాలి. అందుకని వెళ్లడానికి నిశ్చయించుకున్నాను.

ఒక నెలరోజులలో అక్కడి విషయాలన్నీ తెలుసుకున్నాను. అక్కడ కొన్ని దండులున్నాయి. వాళ్లు ఆ కొండల్లో లోయల్లో ఎక్కడెక్కడో ఉంటారు. ఎవరికీ తెలియకుండా. కొండప్రదేశం అవడంవల్ల వాళ్ల ఆచూకీ తీయడంగాని, పట్టుకోవడంగాని చాలా కష్టమయ్యేది.

మా స్టేషను ఇన్‌స్పెక్టరు రాజయ్యను ప్రభుత్వం చాలకాలంనుంచీ బదిలీ చెయ్యకుండా అక్కడే [illegible]ంచేసింది. పదేళ్లలో ఇరవై యిద్దరు దండునాయకులను పట్టి మార్చాడు. రాజయ్య పేరు వినేసరికి దండ్లవాళ్లంతా గడగడ వణికిపోయేవాళ్లు. రాజయ్యనామాలంగా నే దండ్లు చెల్లాచెదరై పోయినవి. ఈ ధైర్యానికీ సాహసానికీ ప్రభుత్వం రాజయ్యను బహూకరించింది కూడా.

కాని ఒక దళము మాత్రం మిగిలిపోయింది. దాని నాయకుడు కొండడు. ఇరవై రెండేళ్లుంటేవి. దండుకొండడు మళ్లీ దండుఉద్యమాన్ని ఉధృతంగా లేవదీశాడు. కొండడు ఇతర దండునాయకుల వలెగాక ఘటికుడనిపించుకున్నాడు. కొండడు తనెక్కడుంటాడో తన

వారికి కూడా తెలియకుండా సంచరిస్తుంటే వాడు

ఓరోజున హఠాత్తుగా మా జిల్లా సూపర్నెంటు వుడ్‌దొర రిజర్వుతో వచ్చాడు రాజయ్యకు మా కందరకూ ఆశ్చర్యం కలిగించింది

"దంగుకొండడు ఈ రాత్రికి హంసపూడిమీద దాడిజేస్తాడని మాకు తెలియవచ్చింది అందుకని రిజర్వుతో వచ్చాను రిజర్వుతోసహా వెళ్లి ఈ రాత్రి కొండడిని అంతంచేయాలి " అని వుడ్‌దొర మాతో అన్నాడు

"ఆవిధంగా వాళ్లను బంధించడానికి పది సంవత్సరాలు ప్రయత్నం చేసి మాకు ముందున్న వైట్‌దొరగారు విరమించుకున్నాడు మన మెంత సాయుధులమైనా దంగువాళ్లు చెట్లలో పుట్లలో దాక్కొని బాణాలు వేస్తారు రాళ్లు రువ్వుతారు కొండడి దగ్గర తుపాకులు కూడా ఉన్నవి కనుక మనం కొండడిని ఒంటరిగా చూసి బంధించాలి ఈ సిబ్బందంతో అనవసరం " అని రాజయ్య సమాధానం చెప్పాడు

'అవును నువ్వు చెప్పిందే సరిగా ఉంది నువ్వు హతమార్చిన దండునాయకుల నందరనూ అదేవిధంగా అంతం చేశావు ఎలాగయినా ఈరాత్రి అవకాశం జారవిడవకుండా కొండడ అంతు తేల్చుకోవాలి ' అన్నాడు వుడ్‌దొర

'ఈసారికి నన్ను క్షమించమని కోరుతున్నాను నేను ఇక్కడ ఎన్నాళ్లనుంచో పనిజేస్తున్నాను బదిలీజేయమని దరఖాస్తు పదేపదే పెట్టుకున్నా ప్రభుత్వం మన్నించలేదు నేను వయస్సులో కూడా పెద్దవాణ్ణవుతున్నాను ఇక ఎండా, కొండా అని తిరగలేను నన్ను క్షమించి మీరు ఇంకెవర్నయినా పంపించమని మనవి " అని రాజయ్య దీనంగా వేడుకున్నాడు

"నువ్విక్కడ లేకపోతే మనం మన్యం నుంచి పోలీసుస్టేషను ఎత్తెయ్యడం జరుగుతుంది నీకు తప్పదు రాజయ్యా "

"తమ రెలాగూ వచ్చారు గనుక తమరు కూడా దయచేయండి మిమ్మల్ని అనుసరిస్తాను దండుకొండడ దగుపించగానే మీకు చూపిస్తాను తమరు ఖైదీగా పట్టుకున్నా సరే షూట్ వేసినా సరే " అన్నాడు రాజయ్య

"అలా వీల్లేదు నేను తిరిగి వెళ్లిపోవాలి ఒరూరు ఆఫీసుపని ఉంది నీకే బాధ్యత నప్పగించి వెళ్లిపోదామని వచ్చాను వీలయినంతవరకు కొండడిని కాల్చకుండా చూడు సజీవిగా పట్టుకొస్తే ప్రభుత్వం నీకు పెద్ద బహుమానం ఇస్తుంది " అని అన్నాడు వుడ్‌దొర.

"తప్పదంటే సరే" అని తలవూపాడు

'పైగా మన్యం ప్రాంతంలో ఉన్న ప్రజల కందరకు నీవు ఆశాజ్యోతివి నీ అండచూసుకొని బ్రతుకుతున్నారు. లేకపోతే ఏనాడో ఈ వూళ్లు వదలిపోయే వాళ్లు వాళ్లను ఈసారి కూడా ఆదరించే బాధ్యత నీదే ఇక నే వెడుతున్నాను ' అని వుడ్‌దొర వెళ్లిపోయాడు

రాజయ్య ఆలోచించి ఆలోచించి నాతో అన్నాడు

'శేషయ్యా, నాకీబాధ తప్పేట్టులేదు ఈ దండువాళ్లతో తగవులాడడంతో నా బ్రతుకు సరిపోయింది '

"అయితే ఈ సాయంత్రం వెడతారా" అని అడిగాను

"నువ్వు, రంగయ్య కూడా వస్తున్నారు మీకు కూడా తరిఫీదు కావాలి కనుక మీరిద్దరు సాయంత్రం మూడయ్యేసరికి బయలుదేరాలి " అన్నాడు రాజయ్య

ఇలాంటి అనుభవం మొదటిది గనుక నా ప్రాణం జంకింది వెళ్లడానికి యిష్టంలేక నేను రాకపోతే వీల్లేదా అని రాజయ్య నడిగితే తప్పదన్నాడు

ఆ రాత్రికి హంసపూడి బంగళాకు జేరాము హంసపూడి మునసబు అచ్చన్నకు కబురుచేశాడు రాజయ్య కొండడు దాడి చేస్తున్నాడట ఈ రాత్రికి నిజమేనా అని అచ్చన్న నడిగాడు రాజయ్య ఈవార్త ఊరంతా పాక్కిపోయింది నిద్రలు పోకుండా ప్రజలు జాగరణ చేస్తున్నారు సమయానికి దేవుడిలా మీ రొచ్చారు మీ రొచ్చారని ఊళ్ళో తెలిస్తే ఉప్పొంగిపోతారు వాళ్ళ ప్రాణాలు కుదుటబడతాయి నే వెళ్లి ఈవార్త తెలియజేస్తాను" అని అచ్చన్న చెప్పాడు

"అచ్చన్నా, రంగయ్యను పంపిస్తాను ఊరిమొగలో కాయండి ఇక్కడనుంచి మేము జూస్తుంటాము" రంగయ్యా రైఫుల్ లోడ్ చేసే ఉంచుకో ఏమాత్రం నీ ప్రాణాని కపాయం కలిగినా పేల్చెయ్యి తెలిసిందా ఏమీ సందేహించకు " అని చెప్పి అచ్చన్నను కానిస్టేబిల్ రంగయ్యను, పంపాడు

రాత్రి రెండవఝామయింది మాకు బంగళాలోకి తుపాకి గుండ్లు పేల్చిన శబ్దము వినిపించింది రాజయ్య ఆదుర్దాగా బయటికెళ్లి చూశాడు తిరిగి లోపలికి వచ్చేశాడు ఇంకో అరగంటలో అచ్చన్న రంగయ్యను భుజానెత్తుకు వచ్చాడు

"కొండడి తుపాకిగుండు ఈయన తొడలోంచి దూసుకుపోయింది రక్తం వరదలై కారుతోంది ఎలాగో యిక్కడకు చేర్చగలిగాను " అన్నాడు అచ్చన్న

రంగయ్యను మంచంమీద పడుకోబెట్టి తన ఫస్టెయిడ్ బాక్సుతీసి, ఆ రక్తం అంతా కడిగి కట్టుకట్టాడు రంగయ్య బాధ చూస్తూంటే నే నెందుకు ఈఉద్యోగంలో చేరానా అని నన్ను నేను నిందించుకున్నాను కాని రాజయ్యమాత్రం చెదరక బెదరక చికిత్సచేశాడు రాజయ్య గుండె దిటవు చూసి నే నాశ్చర్యపోయాను

'శేషయ్యా' అని నన్ను పిలిచాడు

నాకు మూడిందని నేను బిక్కుబిక్కుమంటూన్నాను

"నీవు వెళ్లి కొండడిసంగతి తేల్చుకోవాలి" అన్నాడు రాజయ్య

"నాకా ధైర్యం లేదు రంగయ్య స్థితి చూసిం తరువాత నా గుండె మరీ దిగజారిపోయింది నేను ఉద్యోగమయినా మానేస్తాను కాని నేను మాత్రం అక్కడకు వెళ్లను" అని చెప్పాను

రాజయ్యకు విపరీతమయిన కోపం వచ్చింది కళ్ళు ఎర్రబడ్డాయి కరోక్కుటకుడిలా శాసించాడు నన్ను వెళ్ళక తప్పదని కర్తవ్యనిర్వహణలో వెనుకాడినంగుకు జెయిలుకు వెళ్లాల్సొస్తుంది ఆ సంగతి మరచిపోబాకు అని బెదిరించాడు

ఆ సమయంలో రాజయ్యఆకారం చూసి భయపడిపోయాను వణికిపోతూ నే అచ్చన్నతో బయలుదేరాను ఆ పూటతో నాకు రోజులు నిండినయ్యనుకున్నాను

హంసపూడి మొగలో తుపాకి సిద్ధంగా పెట్టుకుని కొండడి రాకకై ఎదురు చూస్తున్నాను

ఆ సమయంలో కొండడు వచ్చినా నేను చెయగలిగిందేమీ లేదు తుపాకి కొండడికిచ్చి దణ్ణంపెట్టడం తప్ప అచ్చన్న ఒక చెట్టు వనక దాక్కున్నాడు

బెదురుతూ నే చూస్తూ ఉన్నాను ఇంతలో అడుగుల చప్పుడు వినపడ్డది నా

శరీరం కొయ్యబారిపోయింది ప్రాణం ఉన్నా చచ్చినవాడితో సమానమే అయిపోయాను రంగయ్య గుర్తుకొచ్చాడు ఆలోచనలో ఉండగానే నా ఎడమభుజం మీదనుంచి తుపాకీగుండు దూసుకుపోయింది దెబ్బకంటే ముందు భయంతో క్రిందబడిపోయాను

నేను పడడం ఆలస్యంగా తుపాకీగుళ్లు ఎదురు బదురుగా పేలాయి 'అమ్మో, అన్న పెద్దకేక వినబడింది ఇది స్పృహ తప్పిపోయే లోపుగా జరిగింది

నన్ను అచ్చన్న బంగళాకి చేర్చాడట భుజంకడిగి కట్టుకట్టి పడుకోబెట్టాడట

తెల్లవారుతోంది రంగయ్య బాధతో మూలుగుతున్నాడు నాకు మెలకువ వచ్చింది అచ్చన్న మా ప్రక్కనే కూర్చుని ఉన్నాడు

ఇంతలో మాకు ఆ దగ్గరలోనే కర్రలు కొగుతున్న శబ్దం వినిపించింది

'ఏమిటి అచ్చన్నా' అని అడిగాను

'శవదహనానికి ఎవరో ఏర్పాట్లు చేస్తున్నారు' అన్నాడు అచ్చన్న

'అరె పాపం!'

"చూద్దురుగాని రండి" అని మెల్లిగా బయటకు తీసికెళ్లాడు బంగళాముందు నిలచి చూస్తున్నాము

ఒక వ్యక్తి శవాన్ని మోసుకొచ్చి చితిమీద పెట్టి నిప్పంటిస్తున్నాడు

దగ్గరకు వెడదాం పదమని నేను, అచ్చన్న అక్కడకు వెళ్లాము

మేం చేరేటప్పటికి కణకణ మంటూ జగజ్జ్యోతిలా వెలుగుతోంది ఆ ఎర్రటి వెలుతురులో చితివద్ద నిల్చున్న వ్యక్తి ముఖం మీద ఒక కన్నీటి బిందువు భారంగా రాలింది

పరీక్షగా చూశాను ఎవరా అని మా యిన్‌స్పెక్టరు రాజయ్యే అచ్చన్నను ఏమిటిదని అడిగాను

"కొండడు రాజయ్య కొడుకు రాజయ్యకు తన స్వంతకొడుకుని తన చేతులారా చంపడం యిష్టంలేకపోయింది కాని తప్పలేదు" అని అచ్చన్న చెప్పాడు.

దహనం పూర్తయింది

రాజయ్య మమ్మల్ని చూశాడు

'ఇక్కడి కెందు కొచ్చారు పదండి' అని ఖండశాసనుడిలా గర్జించాడు

అచ్చన్న బండికట్టించి ఈ క్షతగాత్రుల్నిద్దర్నీ పట్నం చేర్చాడు" అని శేషయ్య తాత కథ ముగిస్తూ తనుకూడా ఒక అశ్రుబిందువు రాల్చాడు

ఒక పావుగంటసేపు ఆ స్మృతిలో యిద్దరం మాట్లాడలేకపోయాము ★

## కథానిక:




"తాతయ్యోయ్! కొంప లంటుకున్నై లచ్చన్నమావఁ పాకలంటుకుని మంటలేచినయ్ తాతయ్యోయ్" అంటూ కళ్లు నులుముకుంటూ, అప్పి గుడిసెలో కెగిరిపడ్డది

కుక్కిమంచంమీద ఉబ్బసరోగంతో తబ్బిబ్బులైపోతున్న ముసలిఘటం లేనిశక్తి తెచ్చుకొని లేవబోయ్యేడు

"తాతోయ్! ముందు లెగు" ముసలాడు లేవలేకపోయాడు అప్పి కంగారుపడి, "ఎవర్నన్నా లాక్కొస్తా" అంటూ బయటికి చౌకళించింది

మాలపల్లి మాలపల్లంతా భీమానలజ్వాలా కేళిల్లో చిటపట లాడిపోతున్నది మోతుబరి లచ్చన్నమావఁ ఇంట్లో అగ్నిదేవుడు గుప్పుమని లేచి, వరసగా ఉన్న తాటాకు పాకలమీద నిరంకుశాధికారాన్ని చెలాయిస్తున్నాడు

మాలపల్లి మాలపల్లంతా మంట లార్పడంలో నిమగ్నులైయున్నారు అయితే నీళ్లుకూడా కరువేగా! మాలపల్లిలో

ఎవరూ అప్పిమాట లాలకించిన పాపాన పోలేదు అగ్నిదేవుడుకూడా ధనికపక్షపాతమే వహించాడు ఊళ్లో ఎంత ఉన్నతమైన భవంతుల్లేవు? ఆరని ఆకలి ఆ భవనాలమీద తీర్చుకోరాదూ, పట్టెడన్నానికే మొగంవాచిన, పేదలమీద పడి, భస్మం చేయకపోతేను?

అప్పి కెవ్వుమని కేకపెట్టి సొలిపోయింది ముసలితాత పూరిపాకకు నిప్పంటుకుని, కాలి, కాలి, బూడిదరాసైపోయింది. ఆ ముసలిఘటంఎముకలు మచ్చుకైనా భూడిదలో కన్పించవు!

'రేపైనా సచ్చేవోడే అడికి మళ్లీ పుల్లా, పిడకా ఎక్కడ తెత్తాం పనిలో పని' అన్నారు కొంటె కోణంగులు

అప్పిముఖమంతా ఎఱ్ఱబడిపోయింది తన కింకెవరూ నా అనేవాళ్లే లేరేం! చిన్నపుడే తల్లీ తండ్రీ చచ్చారు తన తాతే తనని పెంచి పెద్దదాన్ని చేసేడు ఇప్పుడతనూ బూడిదైపోయేడు

ఇప్పుడు ఇక చచ్చినా మాలపల్లిలో ఉండకూడ దనుకుంది ఏది దారి? ఎక్కడికెళ్లాలి? బంధువు లెవరున్నారు??

ప్రక్క పెద్దూరులో చిన్నమావయ్యున్నాడు కదూ!

తన చిన్నప్పుడు చిట్టిమామ యొచ్చాడు తన తాత, దగ్గుతూ, 'ఇదిగోరా! చిన్నది నే సత్తే దీనికి దిక్కు దివాణం లేర్రోయ్! నువ్వే సూడాలి' అన్నాడు

అప్పుడు తనకు పన్నెండేళ్లుంటాయి తరువాత మళ్లీ అక్కడి కెప్పుడూ రాలేదు అప్పుడప్పుడు తాతయ్య 'సిట్టమావయ్య కబురే తెలవదే! రంగ మెల్లినోడంట! యుద్ధం అయిపోనాక వత్తాడంటమోనే' అంటూండేవాడు అప్పికి యుద్ధమంటే ఏమిటోకూడా తెలీదు, ఫిరంగులు, తుపాకు లేసి, ఒకళ్ల నొకళ్లు కాల్చి చంపుకుంటారని

పెద్ద బరువు మీదపడ్డట్టు జణకిపోయి నిట్టూర్పు విడిచింది కర్తవ్యం బోధపడక ఆలోచిస్తోంది ఇంకా ఆలోచిస్తోంది 'ఉంటే ఉంటాడు! పెద్దూ రెళ్లాలి' అంటూ బయలుదేరింది

మధ్యాహ్నం మాలపల్లి కంతటికీ విద్యార్థులంతా కలిసి చందాలు వసూలుచేసి అన్నదానం చేసేరు అక్కడే నాల్గుమెతుకులు గొంతులో దింపుకొని పెద్దూరు బయల్దేరింది ఆమెకు కడుపునిండా ఆలోచనలే, మెదడునిండా మెదిలే భావాలే! గుండెనిండా యోచనలే! ఊళ్లో కొచ్చింది

నలుగురు యువతులు సీతాకోకచిలుకల్లాగ, శృంగారించుకొని, యౌవనరేఖల్ని ఒలుకబోసుకుంటూ పోతున్నారు అప్పి వాళ్లవైపు వింతగా చూచింది

తన వంటిమీద ఏమున్నై! మట్టిఒట్టి మాసిపోయి, ఆమె అనాఘ్రాతమైన యౌవనమాధుర్యాన్ని కప్పనేలేని పాడు గుడ్డపీలికలు!

లు ఇప్పుడు అల్లాగే వస్తున్నారు వస్తువులభారం మోయలేక ఆస్ట్రేలియాలో కాల్‌గూర్లీ కూల్ గార్డిలో ఉన్న బంగారమంతా వాళ్ల ఒంటిమీదే వుంది! ఒక స్త్రీ ముఖంనిండా పట్టరాని స్ఫోటకంమచ్చలు! నోటిలో ఇముడక పైకి తోసుకొచ్చిన పారపళ్లు!

మరో స్త్రీ అధరం క్రిందికి వ్రేలాడిపోయి, క్రింది పళ్లు అసహ్యంగా వికృతంగా కన్పిస్తున్నాయి ఈ వికృతస్వరూపాలికి మొగంనిండా తెల్లబూడిద మరింత వికృతంచేస్తూ వాళ్లిద్దరు బుట్టబొమ్మల్లాగ నడిచిపోతున్నారు మోయలేని ధనమదంతో

అప్పి ముఖంలో కళాకాంతు లుండి రేఖాత్వంతో మెసలాగుతున్నై ఆ వికారాలకి నగలూ నాణ్యా లెందుకు?

తన కెప్పుడూ ఆ గుడ్డముక్కలే! అంత మంచిబట్టలు తన కెందుకు లేవు? ఆ పాడు ముఖాలికే యెందు కుండాలి? ఇంగులో ఏదో మోసం వుండితీరాలి!

ఆలోచనలతో సాగిపోతోంది ఊరిచివర మాలపల్లెదరికి జేరేటప్పటకి చీకటి పడుతోంది దూరంలో పూరిపాకలు దరిద్రదేవత నివాసాల్లా గున్నై ఎఱ్ఱని సంధ్యాకాశం త్రాగినవాడి కళ్లలా మెఱుస్తోంది

అప్పి బాటమీద నడుస్తోంటే, వెనక ఎవరో నడచివస్తోన్నట్టు, అట్టహాసాలు చేస్తున్నట్టు కనపడింది

ఆ యువకుడు సమీపించాడు తూలుతూ త్రేలుతూ, "ఎవరోవ్! పిల్లో! ఒంటిరి గెల్తుండవ్?" అంటూ మీద పడబోయ్యేడు

అప్పి కంగారుపడింది సంధ్యాకాశంలా అతని కళ్లు ఎఱ్ఱని జ్యోతుల్లాగున్నై అప్పి భయపడి, పరుగెత్తబోయి బోల్తాపడింది అప్పికి ఆ కంఠంలో ఎవరిదో జ్ఞాపకకంఠం వినబడింది 'సిట్టి మావయ్య' గొంతుకలాగే అనిపించింది ఆ యువకుడి నుదుటిమీద మూడో నేత్రంలా మచ్చ! అదే గుఱుతు అప్పి శరీరం పొంగిపోయింది 'చిట్టి మావయ్యా! చిట్టి మావయ్యా' గట్టిగా అరిచింది

"నన్నెరుగుదు వేటే! పేరెట్టి ఎలుగెత్తుతున్నా?"

"నేను, సిట్టి మావయ్యా! అప్పిని తాత ముసలయ్య కాలి చచ్చిపోయినాడు నే నీడ కొచ్చేసినాను"

"ఓసి అప్పి వే నువ్వు సెప్పేవు కాగుంటే"

"రంగమెల్లి ఎప్పు డొచ్చినావ్?"

"సెం తిరుగుద్ది నడు, గుడిసెలోకి నడు"

* * *

గుడిసెదగ్గర కొచ్చి తలుపు తోసేడు ముసలమ్మ హొయ్యి విసరుతోంది

'ఒసేవ్! ముసిలీ! నీ కోడ లొచ్చింది సూడవే'

'ఆ నీ ప్రాణాలమీదికే వచ్చిందిరా మళ్ళీ తాగేసేవురా పోలీసోళ్లు సూస్తే నీ గతేంగానురా రాతి రేం చెప్పావురా'

దాని మజా నీకేం తెలుసే! ముసిలీ! తాగినోడికి తెలుస్తది 'అత్తా మేలకు' నా కొళ్లక్కడికి లాక్కుపోత్తై, ఏం సెయ్యమంటవ్! ఒక్క సుక్క సుకున్న వాడిదే జీయితం ధన్నెం ఏటే అప్పి అంతేనంటావా?'

'అప్పి ఎవ్వరా!'

'ఓసి ముసిలీ! గేనం లేదుటే నీకోడలు నీకోడలు చిన్నబ్బాయి రెండో కూతురే'

'ఓ ఓ అదా, నీతాతకు సుకు వసే'

'సుకు వేటి ఆళ్ల తాత కాలిపోయి బూడిదైపోనాడంట పుల్లా పిడకా ఖర్చు లేకుండా'

'అయ్యో, అయ్యో!'

'కూ ంతు, కబుర్లు సెప్పుదువుగాని'

అప్పి లేచి వెళ్లి నీళ్లు తోడుకుని కాళ్లు ముఖం కడుక్కొని కాసిన్ని దాహం తీసుకుంది లోపలికెళ్లి ఓమూల 'అమ్మయ్య' అని కూర్చుంది

'మూల కూకుంటావేమే? వడుసు దెయ్యంలాగ ఇయ్యిగో సిన్నసేపలు బుట్టలో వుంటై ఎత్తుకొచ్చి తరుగు' ముసలమ్మ అధికారం చలిగించింది

పొద్దుటే లేచి, చిట్టిమామయ్య పనిలోకి పొయ్యేడు ముసలమ్మ ఇక సింహాసన మెక్కింది అప్పిచేతే, అవతలితట్ట ఇవతలి కెత్తటందగ్గఱనుంచీ, అన్నం వండేదాకా చేయిస్తోనే వుంది

'ఏమేవ్! పాకల్లో వయసుకోడె గాళ్లు జాస్తి జాగరతగ మసులుకో' ముసలమ్మ హెచ్చరిక చేసింది

అప్పి అక్కడున్న వాళ్లందరికీ పరిచయమైంది పెద్దపోతురాజుకళ్లు దానిమీద పడ్డై వాణ్ణి చేసుకున్న ముగ్గురు భార్యలు మోసంచేసిపోయేరు ముగ్గురిన్నీ, చొక్కాల్లాగు మార్చేసేడు ఇపుడు నాలుగోదాన్ని వందరూపాయలిచ్చి, ఎఱ్ఱగా బుఱ్ఱగా వుందని తెచ్చుకున్నాడు ఇదీ కాపురంలో నిప్పులు పోసి పోతుందని గూడెంలోవాళ్లు గుస గుసలాడేరు.

'చుఱుకైందే పిల్ల మంచి ఒడుపులో వుంది!' అన్నాడు పోతురాజు

సాయంత్రం చిట్టిమామయ్య ఇంకా రాలేదు రోజు ప్రొద్దుగ్రుంకే వేళకే వచ్చేవాడే ముసలమ్మమనసులో కలవరం రేగింది బాగా చీకటి పడింది ఇంకా రాలేదు కూలికెళ్లినవాళ్లందరూ వచ్చేసేరు పోతురాజు పరుగెత్తుకుంటూవచ్చి, 'ముసలమ్మోయ్! నీ కొడుకుని పోలీసోళ్ళు 'అరెట్టు' సేసేసేరు తాగి అందనాల తొక్కుతున్నాట్ట ఎవడి బుర్రో బద్దలు గొట్టబోయేడంట ఠేషనుకి లాక్కుపోయేరు నే కళ్లారా సూసినా'

'ఆరి నా దేవుడోయ్ నే చెపుతుంటినిరా, తాగితేమాతరం పట్టుకుపోత రేంటి? నిన్న తాగలే? మొన్న తాగలే? ఈపాడు పీడదెయ్యం పిశాచంముండ ఇంట్లో కాలెట్టింది నాకొడుకు పోయాడు నాతం డ్రోయ్' అంటూ అప్పిని చీదరించుకుని తిట్లు తిరుతూ, నెత్తి నోరు మొత్తుకుంది

'గెణ్ణాల్లో మాణ్ణాల్లో ఖైదేత్తారు తెగులు సప్పగా కుదిరింది లే' అంటూ పోతురాజు పోయాడు.

'పోవే శనిగ్గహమా! పీడకారిముండ! ఏం సూపులే దెయ్యంలాగ నీ మూలంగా నే తగలడింగే అయ్యో! నా బ్రతుకేంగాను, దవుర్భాగ్యం?'

ముసలమ్మ అమాయిక అయిన అప్పిని అవలికి గెంటేసి, గుడిసెలో అడుగు పెట్టొద్దంది

* * *

పోతురాజు 'నాలుగోది' కూడా మరోడితో పారిపోయింది పెళ్లాం లేచిపోడంతోటే 'డ్రెస్సు' మార్చేసినట్టు మరో భార్య!

పోతురాజింటో అప్పి మసలుతూంటే ముసలమ్మ కళ్లు మసకలు కమ్మినై 'రాక ఇక్కడున్నావేం' అంటూ కోపల్ని తీసుకోరాబోయింది

పోతురాజు ముసలిదాన్ని గెంటేసేడు

మూడు నెలల అనంతరం చిట్టి మావయ్య వచ్చేడు 'అప్పియేదే' అన్నాడు రావసంతోనే

'పోతురాజుతో మనువు సేసుకుందిరా'

'ఆఁ దానికేం పొగరే' అంటూ బాణంలా దూసుకుపోయాడు పోతురాజు అరుగుమీద చుట్టకాల్చుకుంటున్నాడు

'ఏమోయ్' అన్నయ్యోయ్, ఎప్పుడు రావడం జైల్లో బాగా జరిగిందిరా?'

'ఏం రా మదం గప్పిన కళ్ల పొగరు

# దెయ్యాల కొంప

(16-వ పేజీ తరువాయి)

ఓటమితిన్న సీతమ్మ, వగరుస్తూ, జుట్టు రేగి, పిశాచంలాగ కళ్లు మెరిపిస్తూ వలుగురూ చూడడానికివచ్చిన 'మిత్రరాజ్యసమితి'తో మొర పెట్టుకుంది 'మీరే చెప్పండి, మీరే చెప్పండి' అంటూ గొడవచేసింది గోడు విన్నవారు పెదవులు విరిచేరు ఆ చిన్న కోడలు ఢంకామీద తమ డోళ్లు పనిచేయ వనుకుని నోళ్లు చప్పరించారు

ఇంతలో సీతమ్మ మొగుడు సూర్యరావు, సుబ్బారావు దిగారు వచ్చిమాత్రం ఏం చేస్తారు ?

'ఈ దెయ్యాల కొంపలో ఉండలేం బాబు, అంటూ అత్తగారు ఆడబడుచులు గొడవపెట్టేరు

'ఇదేం క్రొత్తా మనం ఎక్కడున్నా వున్నదేగా అంటూ సూర్యరావు అవతలికి వెళ్లిపోతున్నాడు

సీతమ్మ అవతల ఏడుస్తూ గొడవ పెడుతోంది సూర్యరావు తలవంచుకుని వెళ్లిపోతున్నాడు

'అదేమిటయ్యా! అలా వెళ్లిపోతావు పెళ్లాన్ని చావదన్నితే చూడ పేవయ్యా' అన్న పెద్దమనుషులికి జవాబులేదు

సుబ్బారావే ఇంట్లోవాళ్లని నాలుతిట్టి 'రావమ్మ! వదినా! నీకేం భయంలేదని లోపలికి తీసికెళ్లాడు

'ఎందుకయ్యా తీసుకొస్తావ్ రాకాసిని నా పెళ్లాన్ని నువ్వు నేసుకుంటావురా నీ కెన్ని గుండెలున్నైరా?'

'అల్లాగే లేవోయ్! అప్పి మాయింటి కొచ్చింది ముసలిముండ ఇంట్లోంచి, అవతలికి తరిమేసింది నేనేం దొంగతనంగా తెమ్మన్నానా?'

ఇంతలో అప్పి ఇవతలికొచ్చింది

'చిట్టిమామయ్యో! ఎప్పుడొచ్చావ్ జైల్లోంచి ? బాగున్నావా ?'

చిట్టి మామయ్య వళ్లు మండిపోతోంది 'ఏంలేవే నీ పొగరు ? ఈడితో లేచిపొయ్యావే ? ఇంటికి నడు ?

'ఇగె నాయిల్లు, నన్నింట్లోంచి కుక్కలాగెంటేసింది ముసిల్ది'

చిట్టి మావయ్యమాట్లాడలేకపోయ్యాడు కళ్ళు తిరిగిపోయి, శరీరమంతా అనలంలా మండిపోతోంది ఊగ్పుకుంటూ ఇంటికొచ్చాడు

'ఛీ! రొండముండ! నువ్వే నేనేవే' ముసలమ్మ దభీల్ మని కిందపడింది ★

అంటూ విధవాడ బడుచులు ఎత్తి పొడిచారు'

'నోరుముయ్యండి! అంతా మీయిష్టమే ననుకున్నారేం ? గుట్టుగా సాగాల్సిన కుటుంబాన్ని రచ్చకీడ్చి, బజార్లో తలెత్తుకోకుండా చేసేరు ఈతగవులకే మీరే కారకులు కూడా' అంటూ సుబ్బారావు వాళ్ల మీద విరుచుకు పడ్డాడు వాళ్ళనోళ్లు కట్టుపడతాయా ? ఉరుములు, మెఱుములు, పిడుగులు వర్షాలు అయ్యాక చల్లగా వున్నట్టు ఆకోపంలో వాతావరణం చల్లబడింది

సూర్యరావు కర్మాగారంలో కార్మికుడు పెద్ద జీతగాడు. పైగా పాడైన యంత్రాలు, తంత్రాలు బాగుచేసి మంచి డబ్బు సంపాదిస్తాడు ఆర్థికంగా అతను విజయవంతుడు సుబ్బారావుకు 'ఇత్తడి సామాను' తయారీ కార్ఖానా ఉంది వారే ఆ కలహ కుటుంబానికి జీవనాధారాలు

ఆడబడుచులిద్దరూ తామే సొంతంగా నెయ్యివ్యాపారం చేసుకుని బ్రతుకుతారు మొగుళ్లుపోతే సూర్యరావే వాళ్లిద్దరినీ తెచ్చి, ఇంట్లో పెట్టేడు

సంక్రాంతి పండుగ దినాలు వచ్చాయి సీతమ్మ పుట్టింటికి వెళ్లొస్తానని, అత్తగారి నడిగింది.

'నీవళ్లడానికి వీల్లేదు ఇక్కడే వుండాలి' అంది అత్త

'అడ్డు పెట్టడానికి మీరెవరు ? నేనే పోతా'

'ఆమాత్రం దానికి నన్నెందుకడిగావే' చిన్నకోడలందుకొని, 'పోనియ్యత్తా! మన కెందుకు గొడవ'

ఈమాటలకు సీతమ్మ వళ్లుడుకెత్తింది 'నే పోతే నువ్విక్కడ కులుకవే, నేనుంటే నీకెంత సంతోషమే రెండుపూట్లా పరవాన్నం వొండుకు తినవే కులకవే, మురుసుకోవే' అంటూ సీతమ్మ అక్కణ్ణుంచి లేచిపోయింది చిన్న కోడలు మాటాడలేకపోయింది

ఆరాత్రి సూర్యరావుతో సీతమ్మ చొరవచేసుకుని మాట్లాడింది

'నువ్వు వేరే కాపరం పెడితే నేనుంటాను నేను పుట్టింటికి పోతాను ఇదిగో! చెబుతున్నాను ఈ దెయ్యాల కొంపలో నేనుండలేను

'నీయిష్టంవుంటే వుండు లేకపోతే దయచెయ్యి వేరింటికాపురం లేదు' సీతమ్మ మూడేళ్ళ పుత్రాణ్ణి చంకనేసుకుని పుట్టింటికి దారితీసింది

మళ్లీ ఆ కుటుంబంలో గొడవలు రాలేదు ఐదారునెలలు వడుదుడుకులు లేకుండా గడిచిపోయింది సూర్యరావు రాత్రిళ్లు ఇంటికి రావటం మానేసేడు అన్నంతినేసి ఎక్కడికోపోతాడు ఎవరికీ చెప్పడు ఒక రోజున సీతమ్మ హఠాత్తుగా దిగింది దిగితిన్నగా ఇంట్లోకి వెళ్లిందా? లేదు ఆ యింటి ఎదురుగావున్న ముసలమ్మ ఇంట్లో దూరింది ఎవరైనా పిలిస్తే తన ఇంట్లోకి వెళదాం లేకపోతే గొడవ పెడదామని

సరిగా అప్పుడే చిన్నమ్మ రెండేళ్ళ కొడుకుని ఇవతలికి తీసుకొచ్చేసేరు వాడికి నాలుగు రోజుల్నించి, ఏకధాటిగా జ్వరం ఆ వేళ ప్రాణాలు పోయాయి సీతమ్మ ముసలమ్మ ఇంట్లోంచి ఈవలికి రాగానే అందరు గొల్లుమన్నారు

సీతమ్మ ఇంటి గుమ్మం ఎక్కింది అందరు భోరుభోరున ఏడుస్తున్నారు

సీతమ్మ రాగానే మళ్లీ ఇల్లంతా ఒక్కసారి గుప్పుమంది

సూర్యరావు వేరే కాపురం పెట్టనన్నాడు ఉంటే అందులోనే వుండమన్నాడు సీతమ్మ ఆ దెయ్యాలకొంపలో వుంటం పరమకష్టం నాల్గురోజులు గడిచేయి సీతమ్మ కొడుకు అరుగుమీదనుంచి ఆడుకుంటూ పడిపోయాడు అత్తగారు గుమ్మంమీద కూర్చుని ఆవలించింది చిన్నమ్మ చిన్నబోయింది ఆడబడుచులు

అవతలికి ముఖాలు త్రిప్పారు ఆ యింటి ఎదురుగావున్న ముసలమ్మ పరుగెత్తుకొని వచ్చి పిల్లాణ్ణి అందుకొంది 'ఎంత కచ్చలుంటేమాత్రం పిల్లాణ్ణి చంపుకుంటారమ్మా?' అంటూ దొడ్లో బట్టలు ఉతుక్కుంటూన్న సీతమ్మ చేతికిచ్చింది ఒకనాటి మధ్యాహ్నం ఆడబడుచులు మట్టలు చుట్టుకుంటున్నారు సీతమ్మ పెత్తనాలు చేయబోయింది అత్త, చిన్నమ్మ గుబ్బుపెట్టి నిద్రపోతున్నారు సూర్యరావు భోజనానికి వచ్చాడు ఎవరూ లేచి అన్నం పెట్టలేరు ఇంట్లో కిక్కురుమని వినిపించటంలేదు "మరీ బొమ్మరిల్లయి పోతోంది ఎవరూ లేచి పెట్టరేం' అని సూర్యరావు కేక వేసేరు

"నీ పెళ్ళాన్నడగవయ్యా పెత్తనాలు చెయ్యబోయింది ఇక్కడ మేం తీరుబడిగా లేం" అని ఆడబడుచులు ఏక కంఠంతో అన్నారు

"మీరే మాయింటికి పెద్దల్లా మాట్లాడుతున్నారేమిటి? బోడి ముండలికి పెత్తన మిస్తే ఏదో అయిందట కొరు మూసుకు పడుండండి"

అంటూ సూర్యరావు గిన్నెలో అన్నం పెట్టుకున్నాడు

"మాకేం పెత్తనంబాబు, ఎప్పుడు చచ్చారూ? అంటే 'ఆర్నెల్ల క్రింద, అని పడున్నాం" అని ఆడబడుచులు సణుక్కున్నారు

నాల్గురోజులు శాంతంగా వుంటే వారంరోజులు కలహాకల్లోలంగా వుంటుంది ఈ కయ్యాలన్నీ ఆడవాళ్లలోనే మొగవాళ్లంతగా కాదు బాబు ఆయింట్లో రెండు వేపచెట్లున్నాయి ఆ చెట్టుమీదికి రాత్రిదయ్యాలొస్తాయని చుట్టుప్రక్కల పిల్లలనుకొనేవారు

'తెల్లటి చీరగట్టుకుని పేక బెత్తంతో పెద్ద బొట్టు అదీనీ చెట్టెక్కుతూంటే నే చూసేరా"

"ఏడిసావ్ నీ మొగం! జుట్టు విరబోసుకుని బట్టలేకుండా నే, పెద్దకొరివి పట్టుకుని చెట్టుచుట్టూ ప్రదక్షిణం చేస్తుందిరా"

"కాదోయి, అసలొక పేరాసిపెద్దమ్మ వేషంలో వుంటుందట, నెత్తిమీద తట్ట చేతిలో వేపాకురొట్ట, చంకలో కొండి బుర్రల బుట్ట ఉండి చెట్టుమీదెక్కి పకపక నవ్వుతూ, చెట్టుక్రిందికొచ్చిన వాళ్లని చంపేస్తుందిటరా"

అనితలో విధంగా తీర్మానాలు చేసేవారు ఆ యింట్లోవారే సంసారం పాలిటి దెయ్యాలని ఆలేత హృదయాలకు తెలీదు పాపం!

ఇంతలో సీతమ్మ కడుపుతో వుందని తెలియవచ్చింది చిన్నమ్మ కిది మహాకంటకంగా వుంది " ఇదేం చోద్యమమ్మా! మొగుడు సరీగ్గా చూడటం లేదంటుంది ఏవిటే! వెధవ వేషాలు" అని బుగ్గలు నొక్కుకుంది పదిమందిలో

ఒకరోజున ఆ యింట్లో చూర్లో నిప్పంటుకొని పొగలొస్తున్నాయి సూర్యరావు చూచి ఆర్పేసేడు

"ఇదేం కలికాలం! పాపం పండిపోతోంది లేకపోతే చూర్లోకి నిప్పురావట మేంటి?" అనుకున్నారు

మూడురోజులయ్యాక ఇంట్లో తాటాకు పాక భగ్గుమని అంటుకుంది ఒక్క పది నిమిషాల్లో బూడిదైపోయింది ఆడబడుచుల గోచెసంచులు చుట్టలబుట్టలు తగలబడిపోయాయి 'సీతమ్మే నిప్పంటించిందని' వాళ్లు గొడవచేసేరు నిజం తేలలేదు

ఒకనాటి అర్ధరాత్రి ఇంటి నడికొప్పు మీద భుగభుగ మంటూ అగ్నిజ్వాలలు లేచేయి భయంకరంగా అగ్నిదేవుడు జిహ్వాలు చాచి, అణగారని తృష్ణతో విజృంభిస్తున్నాడు గొల్లుగొల్లు మంటూ జనం ఇవతలికి పరుగెత్తుకొచ్చారు అందిన సామానంతా ఈవలికి లాగేసేరు అంటుకున్న గది పడకగది అదృష్టవశాత్తు అందులో ఎవరూ పడుకోలేరు చల్లగాలికి ఆరుబయట పడుకున్నారు

పాపం పండిపోయినట్లు విద్వేషం విస్తరించినట్లు స్వార్థత్వం బలిసిపోయినట్లు అసత్యం ఆవరిస్తున్నట్లు పెళపెళలాడి మంటలు రేగిపోతూ, పెంకులు చిట్లిపోతూ కెరలి కెరలి అనలకీలలు ఆకాశంలో ధూమమేఘాలు సృష్టిస్తున్నవి

చుట్టుప్రక్కల జనం బజార్లో పడుకున్నవాళ్లు అక్కడికే చేరిపోయారు చేదలు విరిగిపోయేట్లు నీళ్లు తోడేసేరు

సూర్యరావు ఇల్లెక్కిపోయి, మహాధైర్యంగా మంటల్లో చొరబడి ఆర్పడం మొదలుపెట్టాడు పూర్తిగా తడిపేసేక 'ఫైరింజనులు' వచ్చాయి మామూలేగా పూర్తిగా ఇంటివాళ్లు ఆర్పేసుకుంటారు ఇంతలో ఇంజనువాళ్లు వచ్చి ఉన్న గోడల్ని పడగొట్టి నూతుల్లో నీళ్లు ఖాళీచేసిపోతారు

మర్నాడు ప్రొద్దుటికి ఆ యింటిలో ఊహించని వాతావరణ పరిణామం జరిగింది ఇంటికొప్పు బ్రద్దలై, కాలిన దూలాలతో వికృతరూపంలో ప్రత్యక్షమైంది

'ఇదెక్కడి వింత పెంకుటిల్లు నడికొప్పెక్కడన్నా అంటుకుంటుందిరా' అన్నవాళ్లే

'ఇది ఇంట్లోవాళ్లు చేసినపనే' అని రూఢి చేసేరు

ఇంతకూ ఫలితం సీతమ్మ వేరే కాపురంలో వుంది తక్కినవాళ్లు మరోచోటికి పోయారు 'సీతమ్మే యింటికి నిప్పుపెట్టిం'దని చిన్నమ్మ, 'చిన్నమ్మే నిప్పుపెట్టిం'దని సీతమ్మ మాతో అన్నారు నిజం వీళ్ల మధ్యే దాగివుండి ఇవతలికి రాలేక పోతోంది 

**సినిమా:**

# అనుకరణవల్ల నష్టాలు



రష్యనులు విప్లవానంతర దుష్ఫలితాల నుండి బయటపడి జాతీయ పునర్నిర్మాణానికి కళలను సంఘటితపరిచినప్పుడు, కళల బాహ్యస్వరూపంలో జాతీయతా, స్వభావంలో సోషలిజమూ ప్రతిబింబించాలన్న వివాదం సాగదీశారు. రష్యా వలసలుగా ఉండిన జాతులు కూడా తమతమ జాతీయతలను కళలద్వారా ప్రతిబింబించుకోసాగాయి. అంతకు పూర్వం జార్ పరిపాలనలో రష్యాలో జాతీయ వికాసం అణగంటి ఉండటమే గాక ఇతర దేశాల ప్రభావం కూడా హెచ్చుగా ఉండేదని ఇప్పటి రష్యను లారోపిస్తారు.

మొత్తంమీద చైనా జాతీయ పునర్నిర్మాణంతోబాటు చైనాలోని కళలలో కూడా జాతీయవికాసం ప్రారంభమయింది. చాంగ్ కై షేక్ దుష్పరిపాలనలో చైనాలో కళలు వివిధదేశాల ప్రభావాలకు గురి అవుతూ ఉండేవట.

ఇందులో ఆశ్చర్యం ఏమీ లేదు. ఏనాడైతే రాజకీయంగానూ, ఆర్థికంగానూ నిజమైన జాతీయ పునర్నిర్మాణం ఆరంభమవుతుందో ఆనాడే సాంఘికంగానూ, కళలలోనూ కూడా జాతీయత ప్రతిబింబించటం ప్రారంభమవుతుంది. ఏ జాతియొక్క కళలలో జాతీయత ఆక్రమించవలసిన స్థానంలో అరువుతెచ్చుకున్న విజాతీయత పీఠం వేసుకొని ఉంటుందో ఆ జాతి ఇంకా భావదాస్యం విసర్జించలేదనీ, జాతీయ పునర్నిర్మాణం ఆరంభించలేదనీ తెలుసుకోవచ్చు.

ప్రస్తుతం మన సినిమాకళ అటువంటి దుర్దశలో ఉంది. తండోపతండాలుగా వచ్చే హిందీ, తెలుగు, తమిళచిత్రాలను చూస్తూఉంటే ఇందులో జాతీయతా, సంఘమూ, వాస్తవికజీవితమూ, దానికి సంబంధించిన సమస్యలు, ఎక్కడా కనబడవు. ఈ చిత్రాలను తీసేవారు, పొరపాటున ఎక్కడైనా యథార్థజీవితచ్ఛాయలు సినిమాచిత్రాలలోకి ప్రవేశిస్తాయేమోనని వెయ్యికళ్లతో కనిపెడుతున్నారా అనిపిస్తుంది. ఎటువంటి చిత్రం తియ్యాలి అన్న ప్రశ్నకు వేర్వేరు చిత్రనిర్మాతలు వేర్వేరు సమాధానాలు చెప్పవచ్చును గాని, చిత్రంలో జాతీయతా, వాస్తవికతా ఉండరాదన్న విషయమై చిత్రనిర్మాతలందరికీ ఏకాభిప్రాయం ఉన్నట్టు కనిపిస్తుంది. అందుచేతనే, ఈనాడు మనం తీసే చిత్రాలకు కనకవర్షం కురిస్తే కురవవచ్చుగాని, ఏ దేశీయనాయకుడుగాని, గొప్ప కళాకారుడుగాని, మేధావిగాని మన చిత్రాలను బహిరంగంగా ఎన్నిక చేయలేడు. “ఈ చిత్రం మన జాతీయ పునర్నిర్మాణానికి తోడ్పడుతుంది,” అని శిఫార్సు చెయ్యలేడు.

నాలుగేళ్లక్రితం మనం పరిపాలననుండి బయటికి వచ్చినా మనపైనుండి “దైలు నీడలు” తొలగిపోలేదు. ఆ భావదాస్యం ఇంకా అల్లుకొంది. మన రాజకీయ - ఆర్థిక - సాంఘిక పరిస్థితులు మనల నింకా భావదాస్యంలోనే ఉంచుతున్నాయి. అందుకే మనం జాతీయవికాసం అన్వేషించటం లేదు. జీవితానికి సాధ్యమైనంత దూరంగా వెళ్లి సినిమా చిత్రాలు తీస్తున్నాం.

ఈ విషయంలో మనకు “జానపద” గాథలు ఉపయోగిస్తున్న తీరే తమిళులకూ, హిందీచిత్రనిర్మాతలకూ అనుకరణలు ఉపయోగపడుతున్నాయి. తెలుగు జానపదచిత్రాలలో “జానపద” లక్షణాలు ఎంత ఉన్నాయో, హిందీ సాంఘిక చిత్రాలలో సాంఘికలక్షణాలు అంతే ఉన్నాయి.

“వినోదం”కోసం తీయబడే ఈ ఇమిటేషన్ చిత్రాలు ఊరికే పోతున్నాయనుకోరాదు. ఇవి అసంఖ్యాకులైన సినిమా ప్రేక్షకులకు కొన్ని అభిరుచులు కలిగిస్తున్నాయి. ఈ అభిరుచులు వాస్తవిక జీవితానికి ఏవిధంగానూ ఉపకరించేవి కావు. ప్రేమను గురించీ, ఆనందాన్ని గురించీ, వ్యక్తి ప్రవర్తన గురించీ, ఆఖరుకు దారిద్ర్యాన్ని గురించీ అభూతకల్పనలు చెప్పే ఈ చిత్రాలపై అభిరుచి కలిగినవాడు వాస్తవిక జీవితాన్ని ఆమోదించటానికిగాని, వాస్తవిక జీవితసమస్యల నెదుర్కొనటానికిగాని పనికిరాకుండా పోతున్నారు. ఈ చిత్రాలు జీవితంమీద ఒక విధమైన రోత పుట్టిస్తాయి, జీవితసత్యాలను మరుగు పరుస్తాయి, కృత్రిమ జీవితప్రమాణాలను ప్రచారం చేస్తాయి. సంఘక్షేమం కోరేవాడి కిది జాతీయ విద్రోహకరపంథాగా కనబడక తప్పదు.

ఈ పరిస్థితి కేవలం ఒక జానపద చిత్రాలద్వారానే గాని, హాలీవుడ్ చిత్రాల అనుకరణవల్లనే గాని ఏర్పడుతుందనుకో నవసరంలేదు. అభిరుచుల విషయంలో జనసామాన్యానికి వీలయినంత దగ్గరగా వెళ్లే చిత్రనిర్మాతలు ఏమాత్రం అవకాశం ఉన్నా కథల విషయంలోనూ, పాత్రల విషయంలోనూ ప్రజాజీవితానికి సన్నిహితంగా వెళ్లడానికి సంశయించరు. వారికి అటువంటి అవకాశాలు లేకపోవటం పూర్తిగా వారి తప్పు కాదేమో.

సంఘంలోని బహుసంఖ్యాకులైన కార్మికులూ, కర్షకులూ, వారి బాధలూ, కృషీ, సమస్యలూ సినిమాలో స్థానం సంపాదించజాలవని మనం సులభంగా ఊహించుకోవచ్చు. అటువంటి అంశాలతో గూడిన కథలు చిత్రాలుగా తీసినట్టయితే మన జాతీయ ప్రజాప్రభుత్వమే సహించదన్న భావం దాదాపు ప్రతి చిత్రనిర్మాతకూ ఉంది. ఇది నిజం కావచ్చు, కాకపోవచ్చు. ఇదివరలో కొన్ని చిత్రాలకూ, నాటకాలకూ కలిగిన అనుభవాన్నిబట్టి చిత్రనిర్మాతలు భయపడటానికి ఆధారం ఉంది. వాస్తవజీవిత పరిస్థితులను చిత్రించే నాటకాలను కొన్నిటిని మన రాష్ట్ర ప్రజాప్రభుత్వం నిషేధించింది. “ద్రోహి” చిత్రంలో జీవితవాస్తవికత ఏమైనా ఉందేమోనన్న భయంతో ఆ చిత్రాన్ని మూడుసార్లు సెన్సారుచేశారు! అది అభ్యుదయ చిత్రం కూడా కాదు. అందులో ఉన్న సంఘర్షణ కూలీలకూ ఖామందులకూ మధ్య జరిగేది కాదు. మధ్యతరగతిని వంచించే ధనికుడికీ, అడుక్కుతినే వాళ్లకూ మధ్య, వ్యక్తిగతమైన సంబంధాలవల్ల జరిగినది. ఇందులో జీవితవాస్తవికత ఏమీ లేదు. అయినా సెన్సారు వారు మూడుసార్లు స్తనశల్యపరీక్ష చేసి “పదండి!” అన్న ముక్క కాబోలు కత్తిరించారు!

ప్రభుత్వవర్గాలు ప్రదర్శించే ఈ మనస్తత్వం పూర్వపు విజాతీయపరిపాలనలో ఉండిన ధోరణిలోనే ఉండటం అట్లా ఉంచి, చిత్రాలద్వారా జాతీయవికాసం తీసుకురావటానికి కనపడని అంతరాయంగా కూడా ఉంది. సాంఘికదుస్థితిని ప్రభుత్వం తొలగించలేదు. చిత్రాలద్వారా నిరూపించనీదు. ఈ పరిస్థితులలో ఉన్న ప్రభుత్వంమీద ధ్వజమెత్తకుండా చిత్రనిర్మా

(29-వ పేజీ చూడండి)



'దేవకి' తమిళ చిత్రంలో మాధురీ దేవి

# కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో

(15-వ పేజీ తరువాయి)

విధానం గురించి వర్ణించడం విసేసరికి నాకు మూర్ఛ వచ్చినంత పనయింది పారిస్‌లో మిమ్మల్ని అందర్నీ చూసి, ఆయన్ని చూస్తే, ఆయన అసలు మన జాతివాడే కాదని నాకు తోస్తుంది"

"నువ్వు చెప్పింది బాగానే ఉంది; ఇటాలియన్ దొంగల్తో అతని వ్యవహారం మనహా" అన్నాడు చాతో రీనా

"అసలు ఇటాలియన్ దొంగలే లేరు" అన్నాడు డిబ్రే

"భూతాలూ లేవు" అన్నాడు బోశాంప్

"కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో అసలే లేడు" అన్నాడు డిబ్రే

"అప్పుడే పదిన్నర కొట్టింది ఆల్బర్ట్ ఇప్పుడేనా ఒప్పుకో నువ్వు కన్నదంతా కల ఇంక నడు విందుకి"

కాని గడియారం కొట్టిన గంట శబ్దం అంతరించకముందే పరిచారకుడు వచ్చి కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో వస్తున్నట్లు చెప్పాడు

అందరూ ఉలిక్కిపడ్డారు విన్నవారి పై ఆల్బర్ట్ మాటల ప్రభావం ఇప్పుడు వ్యక్తమయింది ఆల్బర్ట్ కూడా ఉలిక్కిపడ్డాడు వీధిలో బగ్గీవచ్చిన శబ్దం కాని, వరండాలో పదాల సవ్వడి కాని వినపడలేదు కవాటాలు కూడా నిశ్శబ్దంగా తెరుచుకున్నాయి మాంట్ క్రిస్టో సావడిమధ్యకి వచ్చాడు దుస్తులెంత నిరాడంబరంగా ఉన్నా, దోషరహితంగా ఉన్నాయి ముప్పై అయిదేళ్ల వ్యక్తివలె కనపడ్డాడు కాని అందరికీ ఆశ్చర్యం కలిగించిన దేమిటంటే, డిబ్రే వర్ణన సరిగ్గా అతనికి అతికినట్లు సరిపోయింది చిరునవ్వుతో మాంట్ క్రిస్టో ఆల్బర్ట్‌ని పలకరించాడు "మీ మహారాజుల్లోనే కొంతోలు ఒకరన్నారు, 'వేళ తప్పక పోవడం రాజుల వినయలక్షణం' అని కాని అది నిత్యం ప్రయాణాలుచేసేవారికి వీలుపడదు ఏ కొద్ది క్షణాలో ఆలస్యమై ఉంటుంది నన్ను క్షమించండి పదిహేను వందలమైళ్లు ప్రయాణం చెయ్యడంలో చిక్కు లనేకం వస్తాయి ఫ్రాన్స్‌లో ప్రయాణం మరీ కష్టమనుకుంటాను" అన్నాడు

ఆల్బర్ట్ ఇలా అన్నాడు "మీరు వస్తారని ఇప్పుడే నా మిత్రులతో చెపుతున్నాను ఈయన కౌంట్ చాతో రీనా, వీరి తండ్రి తాతలు పన్నెండు తరాలవారు సామంతులు వీరు లూషియన్ డిబ్రే, ఆంతరంగిక శాఖామంత్రికి వీరు కార్యదర్శి వీరు బోశాంప్, పత్రికాధిపతి వీరి పత్రిక పేరు చెప్తే ప్రభుత్వానికి హడలు వీరు మాక్సిమిలియన్ మారెల్, సైనికోద్యోగి, కెప్టెన్, శూరుడు"

ఈ ఆఖరి పేరువినేసరికి మాంట్ క్రిస్టో ముఖభంగిమ కొద్దిగా మారింది అందరికీ మామూలుమర్యాదతో అభివందనం చేశాడు మారెల్‌ని మాత్రం మరింత ఆదరంతో ఆశ్వాసించాడు మాంట్ క్రిస్టోముఖం కొద్దిగా ఎర్రబారింది

"కొత్త ఫ్రెంచి విజేతల దుస్తులు ధరిస్తున్నారు మీరు" అన్నాడు మాంట్ క్రిస్టో మారెల్‌తో ఈ మాట లంటున్నప్పుడు అతని కంఠం కొద్దిగా కంపించింది ఎందు కిలా కంపించిందో ఎవరికీ బోధపడలేదు

ఆల్బర్ట్ మారెల్ వంక చూపి ఇలా అన్నాడు: "మా సైనికోద్యోగులలో కెల్ల శూరుడు, ఉత్తమగుణసంపన్నుడు అని ఈయన పేరు తెచ్చుకున్నారు వీరు చేసిన త్యాగాన్ని గురించి ఇప్పుడే విన్నప్పటికీ, ఈయన్ని నేను పరమమిత్రునిగా పరిగణిస్తున్నాను"

"ఓహో! ఉత్తమగుణసంపన్నుడుకూడా!" అన్నాడు మాంట్ క్రిస్టో, ఏదో యోచిస్తున్నట్లుగా ఈ మాటలు విని అందరూ ఆశ్చర్యపడ్డారు మారెల్ కూడా చకితుడై మాంట్ క్రిస్టో వంక తదేకంగా చూడ నారంభించాడు

బోశాంప్ చాతోరీ నావంక తిరిగి మెల్లిగా "ఆయనకి అనుమాన ముందా ఏమిటి?" అన్నాడు చాతో రీనా జాగ్రత్తగా నూతనవ్యక్తిని పరిశీలించి, "నిజంగా ఆల్బర్ట్ మనతో అబద్ధం చెప్పలేదు సుమా చాలా అసాధారణమైన వ్యక్తి కాదూ?" అన్నాడు.

మారెల్ అందుకున్నాడు "నన్నుగురించి ఆయన అన్న మాట కేంగాని, ఆ తీక్షణమైన చూపు, చమత్కారమైన మాట నాకు నచ్చాయి"

అందరూ కలిసి విందుగదిలోకి వెళ్లారు అందరూ ఆసీనులైన తరవాత మాంట్ క్రిస్టో ఇలా అన్నాడు "మిత్రు లందరినీ నేను క్షమించమని కోరుతున్నాను నే నీ దేశానికి కొత్తవాడిని పారిస్ నగరానికి రావడం ఇదే మొదటిసారి ఫ్రెంచివారి ఆచారాలు నాకు తెలియవు ఇంతవరకూ తూర్పుదేశాలవారి ఆచారాలనే నేను అనుసరిస్తూ వచ్చాను వానికి వీనికీ పోలికే ఉండదు సరికదా వైరుధ్యంకూడా ఉండవచ్చును అందువల్ల నేను బొత్తిగా తుర్కీదేశస్థునిలాగా ప్రవర్తించినట్లయితే నన్ను క్షమించండి"

ఆల్బర్ట్ అన్నాడు "మీకు మా భక్ష్యాలు రుచించవని సంకోచిస్తున్నాను మీతో సంప్రదించి మరి ఇక్కడ విందు సిద్ధం చేయించవలసింది"

"మీకు నన్ను గురించి తెలిసినట్లయితే అలా సంకోచించరు నేను ఏదేశంలోవుంటే, ఆ దేశపు భక్ష్యాలు తినగలను చివరికి చీనాలో పిచ్చుకగూళ్లు, కాన్‌స్టాంటినోపిల్‌లో పులావ్ తింటాను అయితే నేను తినేది చాలా తక్కువ నాకవాళ ఆకలి అధికంగానే ఉంది నిన్న పొద్దున్న తిన్నభోజనం తరవాత మళ్లీ తినలేదు నైమ్స్‌వద్ద ఆగి కొంత సమాచారం తెలుసుకునేసరికే జాప్యమైనందువల్ల, అక్కడనించి తిన్నగా ఇక్కడికే వచ్చేశాను"

"నిన్న మీరు బగ్గీలోనే భోజనం చేశారా?" అన్నాడు ఆల్బర్ట్

"లేదు బగ్గీలో నిద్రపోయాను అలసట వచ్చినప్పుడు, కాలక్షేపం చెయ్యడం ఇష్టంలేనప్పుడు, అలాగే నిద్రపోతాను ఆకలివేసినా ఏదీ తినడం ఇష్టంలేనప్పుడుకూడా నిద్రపోతాను"

"అయితే మీరు కోరుకున్నప్పుడల్లా నిద్రపోగలరా?"

"నిద్రపోగలను

"ఆ దెలాగ?"

"అదేం రహస్యం కాదు నల్లమందు, గంజాయి కలిపి తయారుచేసిన లేహ్యం ఒకటి నిత్యం నా దగ్గిరుంటుంది కల్తీకాని సరకు చూసి చీనాదేశంనించి నల్లమందు, భారతదేశంనించి గంజాయి తెప్పిస్తాను రెండింటినీ సమపాళ్లలో కలిపి చేయించిన లేహ్యం మాత్రలుగా చేయిస్తాను మాత్ర తీసుకున్న పదినిమిషాల్లో గుణం కనపడుతుంది ఫ్రాంజ్‌ని అడగండి ఆయన ఒకసారి అది రుచిచూశారనుకుంటాను"

"అవును" అన్నాడు ఆల్బర్ట్ దాన్ని గురించి నాకు చెప్పాడు"

బోశాంప్ నమ్మలేకపోయాడు "మీరు అది ఎప్పుడూ దగ్గిరుంచుకుంటారా?"

"ఎప్పుడూ"

"అదిప్పుడు మీ దగ్గరుంటే చూపగలరా?"

"తప్పకుండా" అన్నాడు మాంటే క్రిస్టో జేబులోనుంచి ఒక చక్కని చిన్న భరిణ పైకి తీశాడు ఒకే పెద్ద పచ్చను చెక్కి తయారుచేసినదది దానికి బంగారు మూతొకటి ఉంది మాంటే క్రిస్టో మూతతీశాడు అందులో ఆకుపచ్చనివి, సెనగగింజలంత మాత్రలు నాలుగైదున్నాయి ఆ భరిణలో డజను మాత్రలు పెట్ట వచ్చు. మూత తియ్యగానే చిక్కని చేదువాసన ఘాటుగా వ్యాపించింది భరిణతీసుకుని అందరూ చూశారు అందరి దృష్టినీ మాత్రల కంటె భరిణ ఆకర్షించింది

"వీటిని మీ వంటవాడే తయారుచేస్తాడా ?" అని అడిగాడు బోశాంప్

"లేదండి అందరికీ నా విలాసాల్ని తెలియనివ్వను నాకు రసాయనశాస్త్రజ్ఞానం కొద్దిగా ఉంది. ఈ మాత్రల్ని నేనే తయారుచేసుకుంటాను "

"భరిణ అద్భుతంగా ఉంది ఇంత పెద్దపచ్చ నా జన్మలో చూడలేదు " అన్నాడు చాతో రీనా

"నాదగ్గర ఇటువంటి పచ్చలు మూడుండేవి ఒకటి ఇటలీ రాజు కిచ్చాను దాన్ని వారు కత్తిలో పొదివించారు రెండోది పోప్‌కి ఇచ్చాను అది వారి కిరీటంలో నెపోలియన్ ఇచ్చిన పచ్చకి ఎదురుగా ఉంది మూడోది నా దగ్గిరే ఉంది దాన్ని గుల్ల చేయించి భరిణగా ఉపయోగిస్తున్నాను "

అందరూ మాంటే క్రిస్టోవంక ఆశ్చర్య సంభ్రమాలతో చూస్తున్నారు. అతను మాట్లాడినమాటలు నిరాడంబరంగా, అతి సహజంగా ఉన్నందువల్ల నమ్మక తప్పలేదు లేదా పిచ్చెత్తి ఉండాలనుకున్నారు

"వీటికి ప్రతిఫలంగా మీ కేమిచ్చారు?" అన్నాడు డిబ్రే

"ఇటలీ రాజు ఒక స్త్రీకి స్వేచ్ఛ నిచ్చారు పోప్ ఒక వ్యక్తిని క్షమించి ప్రాణ మిచ్చారు అంటే, నా జీవితంలో కనీసం ఒక్కసారి భగవంతునికి కల సామర్థ్యం నాకూ సిద్ధించిందన్నమాట "

"మీరు రక్షించినది పెపినోని కాదూ ?" అన్నాడు ఆల్బర్ట్

"కావచ్చు" అన్నాడు మాంటే క్రిస్టో చిరునవ్వుతో

"మీ రీ మాటలు చెప్తోంటే నా కెంత ఆనందంగా ఉందో మాటల్లో చెప్పలేను" అన్నాడు ఆల్బర్ట్ "అరేబియన్ నైట్స్ కథల్ని మించి మానవుల్ని మీరు సమ్మోహ పరచగలవారని నా మిత్రులకు చెప్పాను కాని అదంతా నా భ్రమ అనీ, మిథ్య అనీ, స్వప్నమనీ నాగరికులైన వీరు నిరాకరిస్తున్నారు కాని మీరే నచ్చచెప్పండి వారికి, నేను దొంగలచేత చిక్కాననీ, మీ మాట సహాయంవల్ల విడుదలైనాననీ, లేకపోతే నే నీపాటికి సెంట్ సెబాస్టియన్ శ్మశాన వాటికల్లో చిరవిశ్రాంతి తీసుకుంటూ ఉండవలసిందే ననీ తెలియచెప్పండి "

"అక్కడేం జరిగిందో నా కెంత తెలుసో మీకూ అంతే తెలుసును "

"అయితే నాకు తెలిసినదంతా నేను వీరికి చెప్తాను తరవాత మీకు తెలిసినదంతా చెప్తారా ?"

"అది న్యాయమే "

ఆల్బర్ట్ ఇలా చెప్పాడు: "రోమ్‌ఉత్సవాలలో మూడు రోజులు ఒక యువతి నన్ను చూసి ఆకర్షించబడిందని భ్రమపడ్డాను కాని ఏకాంతంలో కలుసుకోడానికి వెళ్ళేసరికి, పదిహేను, పదహారేళ్ల బాలుడొకడు మారువేషం వేసుకువచ్చి నన్ను మోస పుచ్చినట్లు గ్రహించాను వాడు నన్ను దొంగలచేతుల కొప్పగించాడు దొంగల నివాసం సెంట్ సెబాస్టియన్ శ్మశానవాటికల్లో ఉంది. అక్కడకు నేను వెళ్ళేసరికి దొంగలనాయకుడు లూగీ వాంపా అతిశ్రద్ధగా సీజర్ వ్యాఖ్యానసంపుటి చదువుతున్నాడు నాలుగువేలిస్తే కాని నన్ను ప్రాణాలతో విడిచిపెట్టనని చెప్పి మరునాడు ఉదయంవరకు లూగీ గడువిచ్చాడు వెంటనే నేను ఫ్రాంజ్ కి ఉత్తరం వ్రాసి పంపాను ఉత్తరంలో ఆఖరున లూగీ కూడా ఒక వాక్యం చేర్చాడు ఇప్పటికీ ఆ ఉత్తరం ఫ్రాంజ్ దగ్గరుంది, తరవాత మాంటే క్రిస్టో వచ్చి నన్ను ఎలా విడుదల చేయించారో నా కింతవరకూ తెలియదు కాని ఫ్రాంజ్ కీ నాకూ చాల ఆశ్చర్యం మాత్రం కలిగింది "

"ఇందులో ఆశ్చర్య మేమీ లేదు" అన్నాడు మాంటే క్రిస్టో "లూగీవాంపాని నాకు పదేళ్లుగా తెలుసును అతని చిన్నతనంలో ఒకసారి నాకు అడవిలో అతను దారి చూపించాడు దానికి బహుమతిగా నేను బంగారునాణే లిస్తే, నా కతను స్వయంగా తయారు చేసిన బాకు ఒకటిచ్చాడు ఇది అతని కింకా జ్ఞాపక ముందో లేదో తెలియదు తరవాత ఒకసారి నన్ను పట్టుకోడానికి ప్రయత్నించాడు కాని నేనే అతన్నీ అతని గుంపులో పదిమందినీ పట్టుకుని బంధించాను అప్పుడు వాళ్ళని రోమ్ అధికారులికి నేను ఒప్పగిస్తే ఏమయేదో తెలియదు కాని వాళ్లందర్నీ విడిచిపెట్టేసి ఒక షరతు పెట్టాను నన్ను కాని నా మిత్రుల్ని కాని వాళ్లు తాకనైనా కూడదు నేను చెప్పేది సోషలిస్టులైనవాళ్లకి నచ్చక పోవచ్చు మానవజాతి ఉత్కృష్టతగురించీ, ఇరుగుపొరుగువారి పట్ల నిర్వర్తించవలసిన కర్తవ్యంగురించీ ఘోషించేవారికి నా మాటలు వింతగా కనపడవచ్చు కాని నన్ను మన్నించనివారిని నే నెన్నడూ మన్నించను, క్షమించను నాకు హాని కలుగచెయ్యడానికి ప్రయత్నించేవారిని లక్ష్యపెట్టను సమాజాన్నీ, ఇరుగు పొరుగువారినీ ఎన్నడూ లక్ష్యపెట్టను "

"భేష్" అన్నాడు చాతో రీనా "సమాజంపట్ల కర్తవ్యం కంటె, వ్యక్తిగత అహంభావమే ఎక్కువని నిర్భయంగా చెప్పగలిగింది మొట్టమొదటిసారిగా మీరే! భేష్ "

"దాపరికం లేకుండా చెప్పారని ఒప్పుకుంటాను" అన్నాడు మారెల్ "కాని నిర్భయంగా చెప్పిన ఈ నియమాల్ని ఒక్కసారి తప్పినందుకు ఆశ్చర్య విచారించ రనుకుంటాను "

"ఎప్పుడు నియమం తప్పానో చెప్పండి ?"

"పూర్తిగా పరిచయంలేని ఆల్బర్ట్‌ని విడిపించి మీరు మీ పొరుగువ్యక్తికీ, సమాజానికీ స్వార్థరహితమైన త్యాగం చేశారు "

ఆల్బర్ట్ ఈమారు బిగ్గరగా అన్నాడు "కౌంట్ మీరే పొరపడ్డారు హేతువాదంలో మిమ్మల్ని మించినవారీ జగత్తులో లేరని నా అభిప్రాయం దాని ప్రకారం మీకే స్పష్టంగా ఇప్పుడు బోధపడి ఉంటుంది మీరు అహంభావపూరితులు కారు దానశీలం మీ సొమ్ము మీరు ప్రాచ్యదేశస్థుడినంటారు తూర్పుదేశాల పేర్లనీ చెప్పుకుంటారు మీ వంశనామధేయం మాంటే క్రిస్టో సింద్‌బాద్ అనేది మీ మారుపేరు ఎన్ని పరాయిలక్షణాలు తెచ్చిపెట్టుకున్నా మీ అసలుతత్వం పారిస్‌వాసుల తత్వమే సుమా! లేని దుర్గుణాల్ని ఆపాదించుకోడం, ఉన్న సుగుణాల్ని కప్పిపుచ్చుకోడం పారిస్‌వాసుల లక్షణం మీకూ అదే అబ్బింది "

మాంటే క్రిస్టో మెల్లిగా అన్నాడు "ఆల్బర్ట్! మీ రింతగా నన్ను ప్రశంసించడానికి నేను చేసిం దేదీ లేదు మీరు నాకు కొత్తవారు కాదు మీకు నా గదు లిచ్చినప్పుడే నేను మిమ్మల్ని ఎరుగుదును మీతో కలిసి కొన్ని రోజులు గడిపాను నా బగ్గీ మీ

కిచ్చాను ఉత్సవాలు మీతో కలిసి చూశాను పాపోలోవద్ద ఉరి తీస్తుంటే ఇద్దరం కలిసి చూశాం మీకు దాదాపు మూర్ఛవచ్చినంత పనయింది ఇంత పరిచయంకల మిత్రుని దొంగలచేతుల్లో విడిచిపెట్టి ఎలా ఊరుకుంటాను ? మీ మిత్రుల్నే చెప్పమనండి అదీ కాక, నేను పారిస్ రావాలనుకున్నాను అందుకు మీ అవసరం నాకుంది నేను వస్తానని చెప్పినప్పుడు మీరు మొదట నమ్మలేదు తీరలేని కోరికల్లో ఇది ఒకటనుకున్నారు కాని నేను నిశ్చయంగా ఆ రోజున చెప్పినట్లు ఈపూట రూఢయిందికదా ! ఇప్పుడింక మీరు మీమాట నిలబెట్టుకోవలసి ఉంది ”

“తప్పకుండా నా మాట నిలబెట్టుకుంటాను ” అన్నాడు ఆల్బర్ట్. “కాని మీకు ఆశాభంగం కలుగుతుందని నా భయం చిత్రవిచిత్రాలైన పరిసరాలతో పరిచయంకల మీకు, మీ సాహసాలు, అద్భుతచర్యలకు ఇక్కడ వీలుండదు ఫ్రాన్స్ దేశం కవుల మనఃప్రవృత్తికి అనువైనది కాదు పారిస్ మరీ నాగరికమైన నగరం మాదేశంలో ఏకొండ చూసినా, ఏగుట్ట చూసినా, తంతి పరికరాలే కనపడతాయి ఏ గుహలోకి వెళ్లినా పోలీసుశాఖవారి గ్యాస్ లాంపులే ఉంటాయి నే నింక మీకు చెయ్యగలిగే సహాయం ఒక్కటే ఉంది—నామిత్రులతో మిమ్మల్ని పరిచయంచెయ్యడం ఈ నగరవాసుల ఆచారసంప్రదాయాలు మీకు నచ్చి, ఇక్కడ జీవితం సదుపాయంగా ఉంటే, మీకు సౌకర్యమైన నివాసం చూసి పెట్టగలను రోమ్‌లో మీ నివాసంలో నాకు చోటిచ్చారు ఇక్కడ నా ఈ నివాసంలో మీరు కోరితే ఉండవచ్చును ఒకటి మాత్రం చెప్పగలను ఇక్కడికి ఎవరూ ఎప్పుడూ రారు—అప్పుడప్పుడు పారిస్ యువతులు తప్ప ”

“ఓహో ! యువతులు మాత్రం వస్తారా ? మీరు రోమ్‌లో ఉండగా మీ వివాహంగురించి ఏదో ప్రస్తావన వచ్చింది అది స్థిరపడినట్లేనా ?”

“దాదాపు స్థిరపడినట్లే మా తండ్రిగారు త్వరపడుతున్నారు కానున్న నా భార్యని మీకు త్వరలోనే చూపగలను ఆమెపేరు యూజినీ డాంగ్లర్ ”

“యూజినీ డాంగ్లర్ !” అన్నాడు మాంట్ క్రిస్టో “ఆమె తండ్రేకదూ బారన్ డాంగ్లర్ ?”

“అవునండి ఈమధ్యనే ఆయనకి బారన్ ప్రతిపత్తి ఇవ్వబడింది మీ కాయన్ని తెలుసా ?”

“తెలియదు కాని త్వరలోనే ఆయనతో పరిచయం చేసుకోవాలి ఆయనపేర హుండీ తెచ్చుకున్నాను లండన్‌కి చెందిన రిచర్డ్ ఎండ్ బ్లాంట్, వియన్నాకి చెందిన ఆర్‌స్టీన్ ఎండ్ ఎస్కిలా, రోమ్‌నగరానికి చెందిన థామ్సన్ ఎండ్ ఫ్రెంచి కంపెనీలు వారిపేర హుండీ పత్రాలిచ్చాయి ”

ఆఖరుపేరు చెబ్తూ మాంట్ క్రిస్టో మాక్సిమిలియన్ మారెల్‌ని శ్రద్ధగా గమనించాడు మారెల్ ముఖంలో మార్పు కలిగింది కౌతుకంతో మారెల్ అన్నాడు “థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ ! ఈ కంపెనీ మీకు తెలుసునా ?”

“రోమ్ నగరంలో ఆ కంపెనీయే నాకు బాంకర్లు వారివల్ల మీ కేమైనా నెరవేరవలసిన కార్యం ఉందా ?”

“అవును ఆ కంపెనీకి సంబంధించిన ఒక విషయం తెలుసుకోడానికి చిరకాలంగా కృషిచేస్తున్నాను, కాని ఇంతవరకూ ఫలించలేదు మాకు ఆ కంపెనీ ఒకసారి చాల సహాయం చేసింది కాని ఎన్నిసార్లు ప్రశ్నించినా, అటువంటి సహాయం చెయ్యలేదని ఆ కంపెనీ వాదిస్తోంది ”

“మీకు నేను సహాయం చేస్తాను” అన్నాడు మాంట్ క్రిస్టో

ఆల్బర్ట్ అన్నాడు “డాంగ్లర్ కుటుంబంగురించి మాట్లాడుతూ అసలుసంగతి మరిచాం మనం ఇప్పుడు కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోకి సదుపాయమైన ఇల్లొకటి చూడాలి ఎవరికి తెలిసిన పేర్లు వారు చెప్పండి మన రాజధానీనగరంలో ఈ అతిథికి ఏ నివాసం చూపుదాం ?”

మారెల్ తప్ప మిగతా అందరూ తలొక పేరూ సూచించారు అతనితో చాతోరినా ఇలా అన్నారు “మారెల్ ! మీ ఎరికలో భవన మేదీ లేదా ?”

“ఉంది కాని మీరు చెప్పిన భవనాల్లో ఏదైనా వారికి నచ్చుతుందేమో చూడాలని ఊరుకున్నాను కాని ఆయన కేదీ నచ్చినట్లు కనపడదు అందువల్ల నాకు తోచినది ఇప్పుడు చెప్తాను. ఇదివరలో నా చెల్లెలు మెస్లీవీధిలో ఒక భవనంలో ఉండేది అది బాగుండవచ్చునేమో ?”

“మీ కొక చెల్లె లుందా ?’ అన్నాడు మాంట్ క్రిస్టో

“ఉన్నదండి ఆమెకి అన్ననైనందుకు నేను గర్వపడతాను ’

“వివాహ మయిందా ?”

“వివాహమై తొమ్మిదేళ్లయింది ”

“సుఖంగా ఉన్నదా ?”

“మనిషి కెంతవరకూ సుఖలబ్ధిపొందడానికి వీలుందో, అంతవరకూ సుఖంగానే ఉంది ఆమె తాను ప్రేమించిన యువకుని వివాహమాడింది కష్టాలలోనూ, సుఖాలలోనూ కూడా ఆమె నంటిపెట్టుకుని ఉన్నాడతను అతనిపేరు ఇమాన్యూల్ హెర్బాట్ ”

మాంట్ క్రిస్టో చిరునవ్వు నవ్వాడు

“నేను సెలవు తీసుకున్నప్పుడల్లా అక్కడ వచ్చి ఉంటే వాడిని మీకు వీలైనప్పుడు మాయింట మే మందరం ఆతిథ్య మివ్వగలం ”

“తప్పకుండా మీ చెల్లెలినీ ఆమె భర్తనీ చూడ్డానికి వస్తాను కాని నా నివాసంకోసం మీ రేమీ చింతపడ నవసరంలేదు అది అప్పుడే ఏర్పాటయింది నా కిక్కడ స్వంతఇల్లు ఉండడం మంచిదనుకున్నాను అందువల్ల నా నౌకర్ని ముందుగా ఇక్కడికి పంపాను ఈపాటికి అతను ఏర్పాటుచేసి ఉంటాడు ”

“పారిస్‌నగరం తెలిసిన నౌకరు మీవద్ద ఉన్నాడా ?” అన్నాడు బోశాంప్

“లేడు అతను కూడా పారిస్ రావడానికిదే మొదటిసారి. నల్లగా ఉంటాడు మూగవాడు ”

“ఆలీ కాదూ ?” అన్నాడు ఆల్బర్ట్.

“అవును, ఆలీ చూస్తున్నాడు ”

“నా కతను బాగా గుర్తే మూగవాడు, నల్లజాతివాడూ మీకు ఇల్లెలా సమకూర్చగలడు ?”

“నా కేది కావాలో అతనికి చక్కగా తెలుసు సమర్థతతో అన్నీ నిర్వహించగలడు ఇక్కడ వారంరోజుల్నించి పనిగట్టి తిరుగుతున్నాడు నే నిక్కడికిప్పుడు వస్తున్నానని అతనికి తెలుసు పదిగంటలకి ఫాంటెన్‌బ్లూ సరిహద్దువద్ద నన్ను కలుసుకున్నాడు కొన్న ఇంటి చిరునామా నాచేతి కిచ్చాడు ఇదిగో మీరే చదవండి ” అని ఒక పత్రం మాంట్ క్రిస్టో తీసి ఆల్బర్ట్‌కి ఇచ్చాడు

“అయితే మీ యిల్లెక్కడుందో మీ కింతవరకూ తెలియదా ?” అన్నాడు డిబ్రే

"తెలియదు ఇక్కడికి ఆలస్యంగా రావడం ఇష్టంలేక చిన్నగా వచ్చేసినట్లు చెప్పానుకదా!"

"అయితే మీ మింకేదైనా చెయ్యవలసిఉంటే చెప్పండి పత్రికా రచయితని నేను ఈ నగరంలో నాటకప్రదర్శనాలయా లన్నిటిలోనూ చోటిప్పించగలను"

"మా గుమాస్తా అప్పుడే అన్ని ప్రదర్శనాలయాల్లోనూ జాగా తీసుకుని ఉంటాడు మా గుమాస్తాని కూడా మీకు తెలుసుగా ఆల్బర్ ?"

"అవును బెర్టుక్సియో"

"అతను కొన్నాళ్లు సిపాయిగా ఉన్నాడు తరవాత అక్రమ వ్యాపారంలో చేరాడు అతను చెయ్యలేని పనిలేదు దేనికీ వెనుదియ్యడు కాని నా అవసరాలు తీర్చగలడు, కాబట్టి అతని కసాధ్యమైనది లేదు కాబట్టి, నా నౌకరీలో ఉంచాను"

"అయితే మీకు గుమాస్తా, పరిచారకులు, నివాసం అన్నీ కుదిరాయి కాబట్టి, ఇంక ప్రియురాలు మాత్రమే లోపం" అన్నాడు చాతో రీనా

ఆల్బర్ట్‌కి గ్రీక్ యువతి జ్ఞప్తికి వచ్చింది.

"అంతకంటె మంచి సదుపాయమే ఉంది" అన్నాడు మాంట్ క్రిస్టో నా దగ్గిరొక బానిస ఉంది మీకైతే పైపై ఆడవాళ్లకోసం నాటకప్రదర్శనాలయాలూ అవీ వెతుకుతారు నేను నా బానిసని కాన్‌స్టాంటనోపిల్ నగరంలో కొన్నాను చాలా ఖరీదే పెట్టాను అయినా నేను భయపడవలసిన అవసరం లేదు"

డిబ్రే నవ్వాడు "మీరు మరిచిపోతున్నారు, మేము ఫ్రెంచి దేశస్థులం మహారాజు ఛార్లెస్ చెప్పినట్లు మేము స్వేచ్ఛాపరులం మీ బానిస మా దేశంలో అడుగుపెట్టిన తక్షణం స్వేచ్ఛ పొందుతుంది ఆమె మీ కింక బానిస కాదు"

"నావద్ద ఉండేవాళ్లందరికీ ఎప్పుడూ స్వేచ్ఛ ఉంది వారు కోరినప్పుడు నావద్ద నౌకరీ మానుకుని వెళ్లిపోవచ్చు వెళ్లిపోయినప్పుడు వాళ్లు ఇంకెక్కడా నౌకరీ చెయ్యవలసిన అవసరం కూడా ఉండదు అందువల్లే కాబోలు వాళ్లెవ్వరూ నా నౌకరీ విడిచి వెళ్లడం లేదు"

"అప్పుడే రెండున్నరయింది" అన్నాడు డిబ్రే

అందరూ లేచారు మాంట్ క్రిస్టో తప్ప అందరూ ముందు సావడిలోకి వచ్చారు

ఆల్బర్ట్‌తో డిబ్రే ఇలా అన్నాడు. "నిజంగా మీ అతిథి అద్భుతమైన వ్యక్తిసుమా ఆల్బర్ట్! అయితేం? ఒక్కొక్కప్పుడు కోరిన చోటునుంచి మనల్ని కర్తవ్యం తరుముతుంది నేనింక నా మంత్రిగారివద్దకు వెళ్ళాలి కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టోని గురించి వారికి చెప్తాను"

బోశాంప్ ఇలా అన్నాడు "నేను శాసనసభకి వెళ్ళ నక్కర్లేదు లే డాంగ్లర్ ఉపన్యాసంకంటె చక్కని వార్త నా పత్రికలో వేస్తానివ్వాళ"

"బోశాంప్! ఈయన్ని అందరికీ నేను పరిచయం చేస్తాను నువ్వప్పుడే పత్రికలో కెక్కిస్తే ఎలాగ? ఈయన చాలా అద్భుతమైన వ్యక్తి కాదూ?"

"అద్భుతమంటా వేమిటి, ఆల్బర్ట్! నా జన్మలో ఇటువంటి అసాధారణవ్యక్తిని చూడలేదు మీరుకూడా వస్తున్నారా మారెల్?"

"వస్తున్నాను మా చిరునామా ఆయన కిచ్చాను"

అందరూ వెళ్ళిపోయారు సావడిలో ఆల్బర్ట్, మాంట్ క్రిస్టో మాత్రం మిగిలారు



# సినిమా

(23-వ పేజీ తరువాయి)

తమ జాతీయవికాసంతో కూడుకున్న చిత్రాలు తీయలేరనిపిస్తుంది

కాని సామెత చెప్పినట్టు మనసుంటే మారం ఉండక పోదు చిత్రనిర్మాతలు జాతీయ పునర్నిర్మాణానికి పూనుకున్నట్టయితే జాతీయవికాసంతో కూడుకున్న సంఘటనలు పూర్వచరిత్రలో బోలెడన్ని దొరుకుతాయి, జాతీయవికాసాన్ని ప్రతిబింబించే "పేదరాసి పెద్దమ్మ కథలు ఎన్నయినా రాసుకోవచ్చు, నినాదాలతో పనిలేకుండా, సమస్యలను పరిష్కరించే భారం మీద వేసుకోకుండా జీవితాన్ని ఉన్నదున్నట్టు చాలావరకు చిత్రించుకుపోవచ్చు ఇటువంటి జీవిత చిత్రణంలో వర్గసంఘర్షణా, సాంఘికపీడనమూ ఆటే ప్రతిబింబించదు, నిజమే కాని ఇప్పుడు మనం చూసే అనూతకల్పనంకన్నా, తుచ్ఛమైన అనుకరణలకన్నా ప్రజలదృష్టి జాతిమీదా, జీవితంమీదా బాగా కేంద్రీకరించబడుతుంది

మన జాతీయాచార వ్యవహారాలకూ, మన జీవితసమస్యలకూ, సంఘానికీ చెందని ఎటువంటి చిత్రాన్నయినా ఈ దేశంలో తీయవచ్చు మన ప్రభుత్వం అభ్యంతర పెట్టదు ఇది చాలా శోచనీయమైన పరిస్థితి దీన్ని మార్చటానికి సినిమా ప్రేక్షక సంఘాలూ, ఇతర సినిమాసంస్థలూ దీక్షగా కృషిచేయాలి ఇది జాతీయ దురభిమానం పెంచటానికి అంటున్న మాట కాదు తన జాతీయతను ఆదరించలేని జాతి ఇతరుల జాతీయతలనూ ఆదరించలేదు ఏ అమెరికను చిత్రాన్నో కాపీకొట్టి భారతీయుల పేర్లు పెట్టి వాతావరణమూ, పాత్రలూ, సంఘటనలూ, ఆఖరుకు దుస్తులూకూడా మాతృకలోలాగే ఉంచటం అమెరికాపై అనురాగ మనిపించుకోదు అది భావదాస్యం అనిపించుకుంటుంది భావదాస్యం ఎన్నడూ గొప్పకళలను సృష్టించలేదు ఇతరుల ఆచారవ్యవహారాలు మనకు అనుకరణ యోగ్యం అయినట్టయితే వాటివల్ల తప్పక జాతీయప్రయోజనం ఉండి తీరుతుంది వాటి నెవరూ కాదనరు ఈనాటి సినిమా చిత్రాలలో జాతీయ ప్రయోజనం ముఖ్యంగా ఉండటమే ప్రథమ అసంతృప్తి కారణం

## గ్రంథ సమీక్ష

"అసమర్థురాలి జీవయాత్ర"

కర్త శ్రీ బి ఎల్ దేశపాండే

ప్రచురణ శ్రీకృష్ణ పబ్లికేషన్స్, విజయవాడ

వెల 8 అణాలు

"జీవితమంటే ఏమిటి?"

కర్త శ్రీ రావిప్రాడి వెంకటాద్రి, కవిరాజాశ్రమం, నాగండ్ల

వెల రూపాయిపావలా




# లోకంతీరు

శ్రీ పట్టం పార్థసారది

కొంప లెన్నొ కూల్చి, కోదండరాముని
దేవళాన్ని కట్టి తృప్తిజెందె,
దండధరుడు అచట దండించె ఘాటుగా
విశ్వదాభిరామ వినుర వేమ!

పుణ్య మార్జనకని పుడమిలో కొందరు
ఖర్చుచేసి కాశి గయలు తిరిగి
బిచ్చగాని కొక్క పిడికెడు పెట్టరు
విశ్వదాభిరామ వినుర వేమ.

మాలవాని తాకి మైలపడ్డానని
తాన మాచరించి తనివితీర,
పిల్లి తిన్న బువ్వె పెట్టుక తినెనురా
విశ్వదాభిరామ వినుర వేమ.

స్త్రీలకందరకును స్వేచ్ఛ కావాలని
వేది కెక్కి దంచు వీరు డొకడు,
భార్య బయటికేగ బలెపళ్లు కొరకెరా
విశ్వదాభిరామ వినుర వేమ.

వోటు మా కొసంగ కూటికి గుడ్డకు
లోటు రాదటంచు మాటలాడి,
దేశమందు కరువు తెచ్చిపెట్టారురా
విశ్వదాభిరామ వినుర వేమ

బండి లేని వాన్కి బండిపట్టా లొచ్చె,
భాగ్యశాలి కొచ్చె పంచదార,
మంత్రి చుట్టములకె మంచి పర్మిట్లొచ్చె
విశ్వదాభిరామ వినుర వేమ.

గేయం:

# మాతృప్రేమ



"ఆశావాది"

పెదరాపూరు గ్రామంలోన
పెద వీరయ్యనే కాపొకడు
పెళ్ళాం బిడ్డలతో గూడి
పెంటపాలెం సంత కెళ్ళారు.

రంగురంగుల బొమ్మలతోను
తియ్యతియ్యని మిఠాయితోను
చిత్ర విచిత్రపు బాజాలతోను
సంతంతా సంతోషంతో నిండింది

అదిగోనమ్మా జిలేబి మిఠాయి
కొనిపెట్టమ్మా తింటాను
అన్నాడా అమాయకపు బాలుడు
తల్లి చేతుల్లో దెబ్బ తింటూ.

అదిగో నాన్నా! రంగులరాటం
అదుగో నాన్నా! గాజుల తాత
అన్నాడా అమాయకపు బాలుడు
తండ్రి కేకలు లెక్కసేయక.

రంగులరాటం రింగున తిరగ్గా
మనస్సును దాంట్లో ఐక్యం చేసి
నిశ్చలంగా చూసే బిడ్డకు
తల్లిదండ్రులా ఎడబాటయింది.

రాటపు పరుగు ఆగంగానే
పిల్లల అరుపులు తగ్గంగానే
తనలో ఆశలు రేకెత్తగనే
వెనుదిరిగాడు తల్లి కోసం.

అమ్మా! యని కేకేశాడు
తల్లడిల్లిపోయాడు
"మిఠాయి పెడ్తా ఏడవకమ్మా"
అన్నాడొక దయార్ద్రహృదయుడు.

"మిఠాయి వద్దు, అమ్మే కావాలి"
అన్నాడా బాలుడు మాతృప్రేమతో
"రంగులరాటం ఎక్కనాయనా
గిర్రున బుర్రున తిరుగుతుంది"

"రంగులరాటం వద్దు నాకు
జిలేబి మిఠాయి వద్దు నాకు
అమ్మే కావాలి, అమ్మ లేందే
ఇవన్నీ ఎందుకు" అన్నాడు




చాల నాళ్ళకిందటి కథ! అమెరికాలో ఓ రైతు వుంటూ వుండేవాడు అతను ఓ పెద్ద కుటుంబీకుడు ఆఖరి పిల్లవాడికి నాలుగు సంవత్సరాలుంటాయి వాడిపేరు డెరిక్కు

ఒకనాడు డెరిక్కు ఇంట్లో కనపడలేదు గాభరాపడి వాళ్ళ అమ్మా, నాన్నా అంతా వెతికారు కాని, వాడు ఎక్కడా కనుపించలేదు

ఆ చుట్టుపట్ల ఓ అడవి వుంది "అడవిలోకిగాని వెళ్ళి దారి తప్పి ఉండిపోయి వుంటాడేమో! లేకపోతే ఎక్కడా కనపడకుండా వున్నాడేం? తప్పక అడవిలోనే ఎక్కడో వుండిపోయివుంటాడు" అనుకుని వాళ్ళనాన్న కొందరు పనివాళ్ళతో వాణ్ణి వెతకడానికి అడవికి బయలు దేరాడు

అడవిలో రోజంతా వెతికారు కాని, ఏమీ లాభం లేకపోయింది డెరిక్కుజాడే కనబడలేదు చీకటి పడింది పనివాళ్లు ఎవరిళ్లకు వారు వెళ్లిపోయారు కాని, డెరిక్కు నాన్న వెళ్ళక, ఒక లాంతరు పట్టుకుని ఇంకా వెతకసాగాడు కాని, తెల్లవారిపోయినా డెరిక్కు కనబడలేదు

దానితో అతను కాస్త నిరాశపడి భయపడ్డాడు అయినా, ధైర్యం వదలక ఇంటికి వచ్చి భోజనంచేసి మళ్లా వెతకడానికి బయలుదేరాడు

అలా బయలుదేరుతుండగా, ఆ దగ్గర్లోవున్న ఓ హిందూ దేశస్థుడు అది చూసి అతణ్ణి పిల్చి—"ఏమైందండీ?" అని అడిగాడు

డెరిక్కు నాన్న-"మా అబ్బాయి నిన్నటినుంచి కనబడకుండా వున్నాడండీ పొలాలు,చుట్టుపట్లా అంతా వెతికాము అడవిలోకి గాని వెళ్ళిపోయి వుంటాడేమోనని అడవిలో కూడా రాత్రి పగలూ వెతికాము కాని, కనబడలేదు వాణ్ణి వెతకడానికే మళ్లీ వెళ్తూన్నాను" అన్నాడు

"అయితే, పిల్లాడి జోళ్లూ, మేజోళ్లూ వున్నాయా?" అని అడిగాడు హిందూ దేశస్థుడు

"ఉన్నాయి" అన్నాడు డెరిక్కు నాన్న

"వాటిని యిలా తెండి" అన్నాడు హిందూదేశస్థుడు

వెంటనే డెరిక్కు తాలూకు జోళ్లూ, మేజోళ్ళూ, తెచ్చి యిచ్చాడు డెరిక్కు నాన్న వాటిని తీసుకుని—"రోవర్! రోవర్!!" అని కేక వేశాడు హిందూదేశస్థుడు వెంటనే ఒక్క గెంతు గెంతి ఒక కుక్క అతనిముందుకు వచ్చి నిలుచుంది ఆ కుక్కని అతను ఎంతో మక్కువతో పెంచుతూన్నాడు

"రోవర్! చూశావా, వీళ్ల చిన్నబ్బాయి నిన్నటినుంచి కనబడకుండా వున్నాడు అడవిలో ఎక్కడో దారితప్పి వుండిపోయి వుంటాడు ఇవిగో చూడు ఆ అబ్బాయి తాలూకు జోళ్ళూ, మేజోళ్ళూను"

అంటూండగా—"అయితే, ఆ అబ్బాయిని వెతకాలంటారా? నాకు వీలైనంత కృషిచేసి చూస్తాను" అన్నట్టు కుక్క జోళ్లని, మేజోళ్లని ఒకమారు వాసనచూసి యజమాని వైపు మొఖం తిప్పింది

"అవును, చూడాలి!" అంటూ హిందూదేశస్థుడు అడవివైపు చేయి చూపాడు కుక్క వెంటనే అడవి వైపుకు పరుగెత్తింది

(42-వ పేజీ చూడండి)




జరిగిన కథ —

1587 వ సంవత్సరం లండన్‌లో హెన్రీ మహారాజుకు ఎడ్వర్డు అనే కొడుకూ, నిరుపేద జాన్ కాంటీకి టామ్ అనే కొడుకూ కలిగారు ఇద్దరూ ఒకే పోలిక పదేళ్ల వయస్సప్పుడు టామ్ రాజభవన కేసి వెడతాడు యువరాజు ఎడ్వర్డు టామ్‌ని లోపలికి తీసుకుపోయి ఆదరిస్తాడు ఒకరి జీవితంమీద మరొకరికి ఆసక్తికలిగి దుస్తులు మార్చుకుంటారు టామ్ దుస్తుల్లో యువరాజు కోటబైటకు రాగానే అతన్ని ప్రజలు నానాబాధ పెడతారు తను యువరాజునంటున్నకొద్దీ వాళ్లు అతన్ని ఇంకా ఎక్కువబాధ పెడతారు అక్కడ కోటలో యువరాజుదుస్తులుధరించిన టామ్‌ను యువరాజుగానే అంతా పరిగణిస్తారు అతడు తను బిచ్చగాళ్ల కుర్రాడినని చెప్పినా వాళ్లు ఏచ్చెక్కిం దనుకుంటారేగాని అతనిమాట నమ్మరు ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోతాడు బిచ్చగాడి దుస్తులతో తిరిగే యువరాజు ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీర యువకుడు చేరదీస్తాడు కాని తాను ఇంటలేనప్పుడు యువరాజు తాగుబోతైన జాన్ కాంటీ చేతుల్లోపడినట్లు తెలిసి హెండన్ బయలుదేరుతాడు వృద్ధరాజు చనిపోవటంతో వేల్స్ యువరాజు కాస్తా రాజు కావటం చేత రాజభవనంలోని టామ్ కాంటీకి రాజమర్యాదలన్నీ జరుగుతూ ఉంటాయి ఇక చదవండి

అనువాదం
శ్రీ నండూరి రామమోహనరావు

## 18

మర్నాడు విదేశాల రాయబారులు మహారాజు దర్శనం కోసం వచ్చారు విశాలమైన సింహాసనంమీద టామ్ ఒక మూల నక్కి కూర్చున్నాడు, రాయబారులు హెన్రీ మరణించిన సందర్భంలో తమ తమ ప్రభుత్వాలు పంపించిన సానుభూతి సందేశాలు-ఒక్కొక్కళ్లు అయిదారు పేజీలు చొప్పున చదవటం ప్రారంభించారు

రాయబారులను ముందు చూసినప్పుడు టామ్‌కి సరదాగానే వుంది, ఎందుకంటే వారి దుస్తులు చిత్ర

విచిత్రంగా వున్నాయి. ఒక్కొక్క దేశపు రాయబారి ఒక్కొక్క రకమైన దుస్తులు వేసుకున్నాడు, ఒక్కొక్క రకంగా జుట్టుదువ్వుకుని, ఒక్కొక్క రకమైన టోపీ పెట్టుకున్నాడు వారి బాహ్యాడంబరాల మీద ఆసక్తి తగ్గిపోగానే, వారు చదివే సొదంతా దుర్భరంగా తయారైంది చివరికి రాయబారులు ఎవరిదోవన వారు నిష్క్రమించినప్పుడు టామ్‌కు ఏదో భారం తీసేసినట్టయి తేలికపడ్డాడు.

ఆ రోజంతా రాజకీయవ్యవహారాలతోనే సతమతమయ్యాడు టామ్ వినోదాలకని ప్రత్యేకించబడ్డ రెండు గంటలూకూడా గిజాటుగానే గడిచాయి, ఎందుకంటే రాజుల ఇళ్లల్లో జరిగే వినోదాలు వినోదాల్లాగా ఉండవు, అలవాటులేని వాళ్లకు ముళ్లమీద నుంచున్నట్టు ఉంటుంది.

ఎలాగైతే నేం ఆ రోజుకూడ గడిచింది మర్నాడు అతనికి కొంతవరకూ రాజరికం అలవాటయింది టామ్ ఇప్పటికి మహారాజై మూడు రోజులైంది ఈ మూడు రోజులూ టామ్ "దెబ్బలబ్బయిని" బాగా ఉపయోగించుకున్నాడు అతనినుంచి తనకు కావలసిన సమాచారమంతా రానడమే కాకుండా కాలక్షేపంకూడా అయింది.

కాని నాలుగోరోజంటే టామ్ కెక్కడలేని భయమూ పట్టుకుంది ఆ రోజునుంచీ అతడు ప్రతిరోజూ బహిరంగంగా భోజనమారగించాలి అంతే కాదు, కొన్ని విదేశ వ్యవహారాలను ఫైసలు చెయ్యడం, హెర్ట్‌ఫర్డ్‌ప్రభువును "రాజ రక్షకుడుగా" నియమించడం, మొదలైన గడ్డు వ్యవహారాలు కూడా ఆ రోజునే పూర్తికావాలి

ఆ నాలుగోరోజు రావడం టామ్ కెంత మాత్రమూ ఇష్టం లేదు తెల్లవారకుండా వుంటే బావుండునని పించింది కాని టామ్‌కోసమని సూర్యుడుదయించక మానాడా! తెల్లవారింది, గుండెలపై గంపెడు బరువుతో టామ్ నిద్ర లేచాడు మామూలుగా జరగవలసిన కాలకృత్యాలు యథావిధిగా జరిగాయి దర్బారుకింకా కొంత వ్యవధివుంది

ఈ లోగా టామ్ దిగులుగా పచార్లు చేస్తున్నాడు ఒక నడవాలోంచి మరోనడవాలోకి ఒక కిటికీ తెరిచాడు అక్కడనుంచి కోట ఎదురుగా వున్న రాజబాట బాగా కనిపిస్తోంది జనులు గుంపులు గుంపులుగా కేకలు వేసుకుంటూ పోతున్నారు. అది చూడగానే టోమ్‌లో బాలురందరికీ సహజంగా వుండే కుతూహలం రేకెత్తింద

"ఏమిటో అది? ఎవరన్నా కనుక్కువస్తే బావుండును," అని సందేహిస్తూ అన్నాడు.

పక్కనే వున్నాడు హెర్ట్‌ఫర్డ్ ప్రభువు ఆయన వినయంగా తలవంచి, "తమరు మహారాజులు తమ సెలవైతే ఈ క్షణంలో కనుక్కుని చెప్పగలను," అన్నాడు

"అయితే కనుక్కోండి," అన్నాడు టామ్ ఉత్సాహంగా తనలో తనిలా గనుకున్నాడు "రాజుగా ఉండటంలో కొన్ని ఇబ్బందులున్నా కొన్ని లాభాలు కూడా లేకపోలేదు. కోట్లోంచి మాట రావడంతడవు నిమిషాల మీద చేసేస్తున్నారు నేనంటే వీళ్ల కంత భక్తి ఎందుకో?"

హెర్ట్‌ఫర్డ్ ప్రభువు ఒక భటుని పిలిచి, సంగతేమిటో కనుక్కురమ్మని ఆజ్ఞాపించాడు రాజభటుడు తిరిగివచ్చి ఒక పురుషుడికి, ఒక స్త్రీకి, ఒక బాలికకు న్యాయాధికారులు మరణశిక్ష విధించారని, వారిని వధ్యస్థానానికి తీసుకుపోతుంటే జనులు వెంటపడ్డారని తెలియజేశాడు

మరణశిక్ష అనేమాట వినేసరికల్లా టామ్ హృదయం ఝల్లుమంది. అతనిలో కరుణారసం వరదలై ప్రవహించింది నిండుప్రాణాలతో ఉన్న తోడిమానవులను నిలువునా చంపెయ్యడమా? నేరస్థులు ఎటువంటి నేరంచేశారో, ఆ నేరంవల్ల ఎవరికెంత బాధకలిగిందో, అని అతడాలోచించలేదు. టామ్ ముక్కుపచ్చలారని పసివాడైనా అతని ఉన్నత హృదయం ఒక్క విషయం గుర్తించింది బలవంతంగా ప్రాణాలు తీసేస్తుంటే మనిషి కెలా వుంటుంది? అప్పుడతని మనస్సు ఎలా గిజ గిజలాడుతుంది? అబ్బా!

టామ్ రెండో ఆలోచన లేకుండ, తను పేరుకి మాత్రం రాజనికూడా ఆలోచించకుండా ఆజ్ఞాపించాడు

"వాళ్ల నిలా తీసుకురండి" వెంటనే తెలివితెచ్చుకుని బెదిరాడు. తను అంత గర్వంగా ఆజ్ఞాపించినందుకు కోపం వచ్చిందేమో నని హెర్ట్‌ఫర్డ్ ప్రభువు వంక, రాజభటుడివంక చూశాడు, వారు కించిత్తైనా కోపంగాని, ఆశ్చర్యంగాని

ప్రకటించలేదు. భటుడు రాజాజ్ఞను నెరవేర్చడానికి అవతలకు వెళ్ళిపోయాడు టామ్‌కు ఈసారి నిజంగా ధైర్యం వచ్చింది తన ఇష్టంవచ్చినట్టు అధికారం చెలాయించవచ్చనే నమ్మకం కలిగింది.

టామ్ దర్బారు హాల్లోకి తీసుకుపోబడ్డాడు మంత్రులు, ఇతర ఉన్నతాధికారులు ఎవరి స్థానాల్లో వాళ్లు ఆసీనులయ్యారు టామ్ కూర్చున్న సింహాసనం వెనక అంగరక్షకులు నిలువబడ్డారు. ఇంతలో రాజభటులు టకటక బూట్లశబ్దం చేసుకుంటూ ప్రవేశించారు. ముందు ఒక రక్షకభటాధికారి, అతని వెనుక భటులు, వారిమధ్య నేరస్థులు వచ్చారు.

రక్షకభటాధికారి టామ్ ఎదుట మోకరించి, లేచి, ఒక ప్రక్కకు వెళ్ళి నిలబడ్డాడు. నేరస్థులు మోకరించి అలాగే తలలు వంచుకున్నారు. టామ్ కుతూహలంతో పరికించి చూశాడు నేరస్థుల్ని. వారిలో నలభై ఏళ్ల పురుషుడొకడున్నాడు. అతన్నెక్కడో చూసినట్టనిపించింది టామ్‌కి కాని ఎక్కడ చూశాడో గుర్తురాలేదు ఇంతలో నేరస్థుడు ఒక్కసారి తలఎత్తి టామ్‌ను చూడటానికి ప్రయత్నించాడు కాని మహారాజువేషంలో, గంభీరమైన, దుర్నిరీక్ష్యమైన తేజస్సుతో వెలుగుతున్న టామ్‌ను కన్నెత్తి చూడటానికి సాహసించలేక తల మళ్ళీ వంచేశాడు అతడు తల ఎత్తడంలో ముఖం స్పష్టంగా కనబడి టామ్‌కు రకీమని అంతా జ్ఞాపకం వచ్చింది.

టామ్ ఇలా గనుకున్నాడు "వాడే పీడు సంవత్సరాదినాడు నా స్నేహితుడు గైల్స్‌విట్ థేమ్సు నదిలో మునిగిపోతుండగా రక్షించిందితడే నే నప్పుడితని సాహసాన్ని ఎంతో మెచ్చుకున్నాను. పాపం సైతానుమాయకు లోబడి ఏం నేరం చేశాడో? ఆ రోజు నాకు బాగా జ్ఞాపకంవుంది. ఎందుకంటే ఇతని సాహసకృత్యంచూసి ఆలస్యంగా ఇంటికి వెళ్ళినందుకు మా బామ్మ నన్ను చితకగొట్టింది. అవ్వాళ తిన్నదెబ్బలు జన్మలో మరిచిపోలేను. అంచేత ఆ రోజు నా మనస్సులో శాశ్వతంగా తిష్ట వేసుకుని వుండిపోయింది"

తరువాత టామ్ మిగతా ఇద్దరు నేరస్థులను అవతలికి తీసుకుపోవలసిందని ఆజ్ఞాపించాడు రక్షకభటాధికారిని అడిగాడు

"ఇతడు చేసిన నేరం ఏమిటి?"

అధికారి మోకరించి జవాబిచ్చాడు.

"ఇతడు విషప్రయోగం చేసి ఒకణ్ణి చంపాడు మహారాజా !"

"నేరం ఋజువైందా ?"

"తిరుగులేకుండా ఋజువైంది మహారాజా !"

టామ్ ఇంకేం మాట్లాడతాడు? అతన్నెలాగైనా రక్షించాలనుకున్నాడు. కాని నేరం ఋజువైంతరవాత ఇంకేం చేయగలడు ?

"సరే, తీసుకుపొండి అతన్ని. ఇంత సాహసవంతుడుఅలా ఎందుకు హత్య చేశాడో? (నోరు జారి ఇలా అన్నందుకు టామ్ సిగ్గుపడ్డాడు) అహహ చూట్టానికి మంచి సాహసం గలవాడులాగా వున్నాడే, ఇంత నీచమైన నేరం ఎందుకు చేశాడా అని"

ఖైదీ హఠాత్తుగా తలెత్తి, చేతులు పిసుక్కుంటూ, దీనంగా అన్నాడు·

"ఓ మహారాజా! రక్షించండి, నేనే పాపం ఎరగను. నేనే దోషం చెయ్యలేదు నామీద నేరం సరిగ్గా ఋజువు కాలేదు నాకన్యాయంగా శిక్ష వేశారు. ప్రభూ! శిక్ష కొట్టెయ్యమని నేను కోరడంలేదు. నా కెట్లాగూ చావు తప్పదు. కాని కొంచెం కనికరించండి నన్ను ఉరితీసేలాగు తీర్పు ఇప్పించండి—"

టామ్ చాలా ఆశ్చర్యపడ్డాడు.

"అదేమిటి ? నీకు ఉరిశిక్ష కాదా విధించింది?"

"కాదు మహారాజా! నన్ను సలసల కాగే నూనెలోవేసి చంపుతారు"

టామ్ అదిరిపోయి సింహాసనంలోంచి లేచాడు, భయంతో అతని మోకాళ్లు గజగజ మన్నాయి, మొహం పాలిపోయింది. కొంతసేపటికి తేరుకున్నాడు.

"అలాగే. నీకోరికను మన్నిస్తాం. నువ్వు వెయ్యిమందికి విషంపెట్టి చంపినా నీ కలాంటి ఘోర శిక్ష వెయ్యను"

బంధితుడు సాష్టాంగపడి అంతులేని సంతోషంతో, కృతజ్ఞతతో అన్నాడు

"ప్రభూ! దేవుడు మి మ్మెప్పుడూ రక్షించుగాక! మీరు ఈ బీదవాడిపై ఈరోజున చూపిన కనికరం సూర్యచంద్రు లున్నంతవరకూ ప్రపంచం మరిచిపోదు"

టామ్ హెర్ట్ ఫర్డ్ ప్రభువు నడిగాడు.

"ఇతడు నేరం చేసినప్పటికీ ఇంత ఘోరశిక్ష విధించడం న్యాయమేనా?"

"అది మనదేశ శాసనాల రీత్యా న్యాయమే మహారాజా! జర్మనీలో దొంగనాణెములు ముద్రించిన వారినికూడా మరిగే నూనెలో కాల్చి చంపుతారు—నూనెలో ఒక్కసారిగా పడెయ్యరు తాడుతో పైనుంచి వేలాడదీసి కొంచెం కొంచెం నూనెలోకి దింపుతూ, ముందు పాదాలవరకూ, తరవాత మోకాళ్లవరకూ—"

"ఆగండి ఇక చెప్పద్దు వినడానికే భయంగా వుంది," అంటూ టామ్ అరచెయ్యి వెలుపలకు పెట్టి కళ్లుమూసుకున్నాడు గగుర్పాటు తగ్గిన తర్వాత అన్నాడు

"ఈ ఘోరశాసనం నేటినుండీ మార్పించండి. ఇది మానవులకు తగిన న్యాయం కాదు—రాక్షస న్యాయం"

హెర్ట్ ఫర్డ్ ప్రభువు ప్రభువుల తరగతికి చెందినవాడైనా, మిగతా వారివలె క్రూరుడు కాదు తన "మేనల్లుడి" దయాబుద్ధిని ఇలా ప్రశంసించాడు.

"మహారాజువాక్కే శాసనం ఈనాటినుండీ ఈ అమానుష శాసనాలు రద్దుచేసే ప్రయత్నాలు చేస్తాం చరిత్ర మీ వంశాన్ని, ముఖ్యంగా మిమ్ము కృతజ్ఞతతో జ్ఞాపకం ఉంచుకుంటుంది"

రక్షకభటాధికారి ఖైదీతో అవసరం తీరిపోయిందనుకుని వాడిని అవతలకు తీసుకుపోబోయాడు. కాని టామ్ "ఆగు" అని ఆజ్ఞాపించి, "ఈ ఖైదీ తనమీద నేరం బాగా ఋజువుకాలేదంటున్నాడు నేనే స్వయంగా విచారణ చేస్తాను, నీకు తెలిసింది నువ్వు చెప్పు," అన్నాడు

రక్షకభటాధికారి చేతులు జోడించి సమాధానం చెప్పాడు

"కోర్టువారి విచారణలో నేరం ఇలా తేలింది ప్రభూ! ఇస్లింగ్టన్ పేటలో ఇతడు ఒక పూరికొంపలోకి వెళ్ళడం చాలమంది చూశారు ఆ కొంపలో ఒకడు జబ్బుగా వున్నాడు అతడు ఒంటరిగా నిద్రపోతున్నాడు ఇతడు లోపలికి వెళ్లి అయిదు నిమిషాల తర్వాత బయటికి వచ్చి తనదోవన తాను పోయాడు. లోపల జబ్బుతో వున్న వ్యక్తి మరొకగంటలో గిలగిల కొట్టుకుని, చాలా బాధపడి మరణించాడు"

"ఇతడు విషమిస్తుంటే ఎవరన్నా చూశారా? అసలు విషం కనిపించిందా?"

"లేదు ప్రభూ!"

"అయితే విష మిచ్చినట్టు ఎలా ఋజువైంది?"

"లక్షణాలు చూస్తే విషంవల్ల చనిపోయినట్టేవుందని వైద్యులు నిర్ధారణచేశారు"

శాస్త్రజ్ఞానం ఆట్టే అభివృద్ధి కాని ఆ రోజుల్లో వైద్యులకున్నంత ప్రభావం ఇంకెవరికీ లేదు అందుచేత టామ్ ఇంకేమనటానికీ వీల్లేకపోయింది.

"వైద్యులు నిర్ధారణ చేసిం తర్వాత ఇక అనుమానం లేదు. విషప్రయోగమే జరిగివుంటుంది"

"అంతేకాదు మహారాజా! ఇస్లింగ్టన్‌లో ఇదివరకు ఒక మంత్రగత్తె ఉండేది ఆమె రోగి విషంవల్ల చనిపోతాడని ఒకసారి 'సోది' చెప్పిందిట పైగా ఫలానా ఫలానా మాదిరిగా ఉండే ఒక కొత్తవాడు వచ్చి విషం పెడతాడనికూడా 'సోది'లో చెప్పిందట ఆ మంత్రగత్తె చెప్పిన మాదిరిగానే ఈ ఖైదీ ఉన్నాడని పలువురు సాక్షులు సాక్ష్యమిచ్చారు కనుక ఈవిధంగా నేరం ఋజువు చేయబడింది"

నేరానికింతకంటే గొప్ప ఋజువేంకావాలి ఆ అజ్ఞానయుగంలో? మంత్రగత్తెల జోస్యమంటే ఆ రోజుల్లో భయభక్తులు విపరీతంగా ఉండేవి ఖైదీని ఇక మానవమాత్రుడెవడూ రక్షించలేడని టామ్ గుండె రాయిచేసుకున్నాడు అయినా ప్రయత్నించి చూద్దామని,

"నువ్వేమన్నా చెప్పుకునేదంటే చెప్పుకో," అని ఖైదీకి అనుజ్ఞ ఇచ్చాడు

"నేను నిర్దోషిని మహారాజా! కాని నే నెంత వాదిస్తేమాత్ర మేం లాభం? నా తరఫున సాక్ష్యమిచ్చే మనిషి ఒక్కడూ లేడు ఉంటే, ఆ రోజున నేనుఇస్లింగ్టన్ పేటకు వెళ్లనే లేదని ఋజువు చేసిఉండేవాడిని. అసలు ప్రాణం తీయటానికి వెళ్లానన్న సమయంలో నేను థేమ్సునది దగ్గర వున్నాను—"

"ఏం చేస్తున్నావక్కడ?" అడిగాడు టామ్.

"మునిగిపోయే ఒక కుర్రవాణ్ణి ఒడ్డుకు లాక్కొస్తున్నాను—"

"అరె నిజమేనా?"

"నిజం మహారాజా!"

టామ్ రక్షకభటాధికారివైపు తిరిగి,

"ఏ రోజున ఇతడు హత్యచేశాడన్నావు?" అని అడిగాడు.

"కిందటి సంవత్సరాదినాడు పగలు పదిగంటల వేళ—"

"ఖైదీని విడిపించండి ఇది మహారాజు ఆజ్ఞ"

దర్బారులో గుసగుసలు బయలుదేరాయి టామ్ ఏదో తప్పు చేసినవాడిలా జంకుతూ అందరి వంకా చూశాడు. బుద్ధిపూర్వకంగానే తను ఈ ఆజ్ఞ ఇచ్చినట్టు అంతా అనుకోవాలని ఇంకా ఇలా గన్నాడు.

"నేరం సరిగా ఋజువు కాలేదు. ఎవరో బుద్ధిహీనులిచ్చిన సాక్ష్యాలు విని ఈ అమాయకుడికి మరణశిక్ష విధించడం నాకు మహా కోపం కలిగిస్తున్నది"

దర్బారులో గుసగుసలింకా ఎక్కువయ్యాయి. అందరూ టామ్‌ను మెచ్చుకుంటున్నారు, అతడిచ్చిన తీర్పుకు కాదు, అతని న్యాయబుద్ధికి కాదు. టామ్ చూపిన తెలివి తేటలకి వాళ్లాశ్చర్యపోయారు.

"మహారాజు పిచ్చివాడని అన్నవాళ్ళే పిచ్చివాళ్లు—"

"ఎంత తెలివైన ప్రశ్నలడిగారు మహారాజు! అనలాయన తత్వం మొదటినుంచీ అంతే రెండు నిమిషాల్లో తేల్చిపారేస్తారు ఎంత గొప్ప సమస్యనైనా అబ్బే! ఆయనకు పిచ్చేమిటి? శుభ్రంగా ఉన్నారు"

"దేవునిదయ వల్ల మహారాజు ఆరోగ్యం బాగుండింది. సరిగ్గా తండ్రిమో స్తరే—"

సభ్యులీవిధంగా ఎవరికి తోచింది వాళ్లు గుసగుసలాడుతున్నారు. అక్కడక్కడ కొన్ని మాటలు టామ్ చెవిని పడ్డాయి అంతా తన్ను మెచ్చుకుంటున్నారని గ్రహించాడు దాంతో మరింత ధైర్యం ఏర్పడింది ఖైదీని భటులు అవతలకు తీసుకుపోయి విడుదల చేయగానే మిగతా ఇద్దరు ఖైదీలను తీసుకురమ్మని టామ్ ఆజ్ఞాపించాడు.

ముప్పయ్యేళ్ళ ఒక స్త్రీ, పదేళ్ల బాలిక దర్బారులోకి ప్రవేశపెట్టబడ్డారు. వారు గొల్లున ఏడుస్తూ వచ్చారు. భటులు వాళ్ళని నోరు మూయించారు

"వీళ్ళేం నేరం చేశారు?" టామ్ రక్షకభటాధికారి నడిగాడు

"వీళ్ళిద్దరూ మంత్రగత్తెలు మహారాజా!"

"ఏం చేశారో చెప్పు?"

"మాంత్రికశక్తులు సంపాదించడంకోసం వీళ్లు తమంతట తామే సైతానుకు అమ్ముడుపోయారు"

టామ్ ఒళ్లు జలదరించింది. పుస్తకాల్లో ఇలాంటి భయంకర కథలు చాలా చదివాడు.

"అందుచేత వీరికి ఉరిశిక్ష విధించారు కోర్టువారు."

"ఏరోజున జరిగింది ఈ అమ్మకం?"

"కిందటి డిసెంబరులో ఒకరోజు అర్ధరాత్రివేళ"

"ఎక్కడ జరిగింది?"

"శ్మశానంలోనండి"

"అక్కడ అప్పుడెవరెవరున్నారు?"

"పిల్లిద్దరేనండి—అన్నట్టు వాడు కూడా"

"వాడెవడు?"

"దేవుని విరోధి సైతాను"

"అయితే వీళ్లు అమ్ముడుపోయినట్టు ఎలా తెలిసింది?"

"వీరు శ్మశానానికి వెడుతుండగా కొందరు తాము చూసినట్టు సాక్ష్యాలిచ్చారు అందువల్ల సైతానుకు అమ్మకం జరిగివుంటుందని సందేహం కలిగింది. పైగా కొన్ని రోజుల తరవాత ఈ ఇద్దరూ తమ మంత్రప్రభావంవల్ల గొప్ప తుపాను తెప్పించారు ఆ తుపాను స్వయంగా చూసినవాళ్లు, దానివల్ల ఇళ్లూ వాకిళ్లూ పోగొట్టుకున్నవాళ్లు అనేకమంది సాక్ష్యాలిచ్చారు"

"తుపానువల్ల ఈ స్త్రీకూడా నష్టపడిందా?"

టామ్ వేసిన ఈ ప్రశ్న చాలా తెలివైందని కొందరు పెద్దతలకాయలు మెచ్చుకున్నారు. రక్షకభటాధికారికి మాత్రం ఈ విచారణ పట్టి చాదస్తంగా కనిపించింది

"అవును ప్రభూ! తుపానులో ఈమె ఇల్లూ వాకిలీ కూడా కొట్టుకుపోయాయి"

"అంటే తను కల్పించిన తుపాను వల్ల తనుకూడా నష్టం పొందినదన్నమాట ఆమెకు మంత్రశక్తివల్ల వచ్చిన లాభమేముంది? ఈ మాత్రందానికి తననూ, తన కూతుర్ని సైతానుకు అమ్ముకోవడం చూస్తే ఈమె పిచ్చిదని తేల్తున్నది. పిచ్చివాళ్లకు తామేం చేస్తున్నదీ తమకే తెలియదు కనుక వాళ్ళకు పాపం అంటుకోదు"

టామ్ తెలివితేటల్ని పెద్ద తల

కాయలు మరోసారి మెచ్చుకున్నారు.

"ఈ బాలిక కెన్నేళ్లు?"

"తొమ్మిదేళ్లుంటాయి ప్రభూ!"

"మైనారిటీ తీరని పిల్లలకు ఇలా క్రయవిక్రయాలు చేసేందుకు అధికారం ఉందా?" అని టామ్ దర్బారులోని ఒక జడ్జీ నడిగాడు.

జడ్జీ కొంతసేపు ఆలోచించి సమాధాన మిచ్చాడు

"న్యాయశాస్త్రరీత్యా మైనర్లకు క్రయ విక్రయాధికారాలు లేవు. కాని సైతానువిషయం వేరు. ఒక మైనరును సైతాను కొనదలచుకుంటే మనం అడ్డగించలేం అదే ఒక ఇంగ్లీషువాడు చేస్తే న్యాయశాసనం అతన్ని అడ్డగించగలదు"

టామ్‌కు బలే కోపం వచ్చింది

"తమ మొహంలాగుంది న్యాయశాసనం. గౌరవస్థుడైన ఇంగ్లీషువానికి లేని అధికారం సైతాను కెందుకుండాలి? అక్రమం కాదా?"

టామ్ తెలివి చూసి ఇంకా ఆశ్చర్యపోయారు సభలోని పెద్ద బుర్రలు ఎవరికీ తట్టని ఇంత గొప్ప ప్రశ్న "మహారాజుకు" తట్టినందుకు వారు చాలా మెచ్చుకున్నారు.

టామ్ వాదించేధోరణి చూసి నేరస్థులకు కొంత ఆశ కలిగింది. అందుచేత జాగ్రత్తగా వింటున్నారు ప్రతిమాట. ఇది గమనించి టామ్ మరింత జాలిపడ్డాడు వారిమీద. అధికారిని తిరిగి ప్రశ్నించాడు

"తుపాను ఏ విధంగా తెప్పించారు వీళ్లు?"

"కాలి మేజోళ్లు విప్పి దులిపితే తుపాను వస్తుంది"

టామ్ కుతూహలానికి పట్టపగ్గాలు లేవు. ఉత్సాహంతో అడిగాడు:

"బలే, బలేగా వుంది అలా చేస్తే తుపాను ఎప్పుడు రమ్మంటే అప్పుడు వస్తుందా?"

"అవును మహారాజా! కొద్దిగా మంత్రాలు కూడా చదువుతారనుకుంటాను"

టామ్ ఆ స్త్రీకేసి తిరిగి "ఏదీ తుపాను తెప్పించు," అని ఆజ్ఞాపించాడు.

సభ్యులంతా ఉలిక్కిపడి లేచారు వాళ్ల కంగారు చెప్ప నలవి కాదు. తుపానుప్రమాదాన్నుండి తప్పించుకోవడ మెలాగో తెలియ లేదు. ఆ రోజుల్లో మంత్రశక్తుల మీద అంత మూఢవిశ్వాసం ఉండేది.

సభ్యుల అవస్థను టామ్ గమనించ లేదు తుపాను ఎలా వస్తుందో చూడాలన్న ఆదుర్దాలో తన ప్రజల యోగక్షేమాలు మరిచిపోయాడు.

టామ్ ఆజ్ఞ విని నేరస్థురాలు తెల్లబోయింది

"ఫరవాలేదు. నీకేం భయం లేదు. నిన్ను విడుదల చేస్తాను. తుపాను తెప్పించు."

ఆమె తిరిగి గొల్లున ఏడుస్తూ,

"మారాజా! నా కే మంత్రాలూ చేతకావు బీదముండని, కాపాడండి, బతికినన్నాళ్లూ మీ దయ మరిచిపోను"

"నువ్వు భయపడుతున్నావు ఊరికే నీ మీద ఈగ వాలనివ్వను. ఒక్కసారంటే ఒక్కసారి తుపాను తెప్పించావంటే నీకు గొప్ప బహుమానంకూడా ఇస్తాను నిన్నూ, నీ కూతుర్నీ కూడా విడుదల చేస్తాను ఒక్క తుపాను చాలు— ఎంత చిన్నదైనా సరే"

పాపం నేరస్థురాలు ఇంకా ఏడుస్తూ మొత్తుకుంది తన కలాంటి శక్తులు లేవనీ, ఉంటే మహారాజు ఆజ్ఞప్రకారం చేసి తన కూతుర్ని బతికించుకునేదాన్ననీ, తనను చంపి తన కూతుర్ని వదిలేసినా సంతోషమేననీ అన్నది.

టామ్ చివరికి లా గన్నాడు:

"ఈ స్త్రీ నిజం చెబుతోందని నేను నమ్ముతున్నాను. నిజంగా మంత్రశక్తులే వుంటే తన కూతుర్ని రక్షిస్తానన్నా ఎందుకూరుకుంటుంది. అమ్మా! ఇక మీరు పోవచ్చు. మిమ్మల్ని విడుదల చేశాను"

తల్లీ కూతుళ్లు తమ ప్రాణాలు దక్కినందుకు సంతోషం పట్టలేక టామ్‌కు వంగి వంగి నమస్కారాలు చేశారు వారు వెళ్లబోతుండగా టామ్ ఆగమన్నాడు.

"అమ్మా! నా మాట వినవ్? ఒక్కటంటే ఒక్క తుపాను చాలు. నీ కెంత డబ్బు కావాలంటే అంత డబ్బిస్తాను అసలు నీ మేజోళ్లు విప్పి దులుపు తుపాను వస్తుందేమో చూద్దాం"

బీదరాలు టామ్ ఆజ్ఞను శిరసావహించింది. టామ్ అత్యంత కుతూహలంతో చూస్తున్నాడు, సభికులు కంగారుపడడం మొదలెట్టారు. ఆమె మేజోళ్లు దులిపింది. తన కుమార్తె మేజోళ్లుకూడా విప్పి దులిపింది. కాని అందులోంచి రెండు మూడు గడ్డిపరకలు తప్ప తుపానూ రాలేదు, గిపానూ




పూర్వం మన దేశంలో ఒక రాజుండెను అతనికి ముగ్గురు భార్యలుగలరు. వారిలో మొదటి యామెకు సంతానములేక పోగా రాజు రెండవ భార్యను పెండ్లాడెను ఆమెకును సంతానము కలుగలేదు అప్పుడొక మూడవ యామెను పెండ్లాడెను కొంతకాలమునకు మూడవ భార్యకు సంతానముకలుగు చిహ్నము లగుపించెను రాజీవార్తనువిని అపరిమితానందము నొందెను. తనభార్యయెడ పరిజనము మొదలైన వారు కడు జాగరూకతతో వర్తింప వలసినదిగా నతడాజ్ఞాపించెను తరచు ఆమె యొద్దకుబోవుచు, ఆమె కానందము కలుగురీతిని తాను ను మసలుచుండెను మూడవ భార్యకడకు రాజు ఇంత అనురాగముతో వచ్చుచు బోవుచుండుట మొదటి యిరువురు భార్యలకు సహింపరానిదయ్యెను తాము జీవించియుండగనే తమ సవతికొక బిడ్డకలగడం, ఆ బిడ్డయే యీ రాజ్యమునకంతకును వారసుడు కావటం, జరుగనున్నందులకువారు చాల అసూయ పడిరి అందుచేవారు రాజకుటుంబమునకు ప్రత్యేకముగా బనికివచ్చునొకమంత్రసానితో రహస్యాలోచనచేసి ఎట్లైన నామెచే దమ సవతిక గలుగబోవు బిడ్డను చంపింప నిశ్చయించిరి వెంటనే వారు మంత్రసానినిబిలిచి, నీవు రాజుగారి మూడవభార్య ప్రసవించు సమయమునకు దగ్గరనుండి ప్రసవించిన శిశువుస్థలములో నొక కుక్కపిల్లను బడవైచి శిశువును జంపవేయుమని చెప్పిరి.

అంత కొంతకాలమునకు రాజుగారి మూడవభార్య ఒక మగబిడ్డను గనెను మంత్రసాని ఆ బిడ్డను దనతో దీసికొని పోవుచు దాని స్థానముననొక కుక్కపిల్ల నుంచెను. కాని పసిబిడ్డను చంపుటకు దానికి చేయిరాలేదు అందుచే నామె యా బిడ్డను బట్టలలోగప్పి తీసికొనిపోయి యొక వడ్రంగి యింటి గుమ్మము నొద్ద పడవైచెను

తన భార్యయొక కుక్కపిల్లను గనినదనువార్త రాజు చెవుల బడగానే యతడాగ్రహము చెందెను. అతనికి గలిగిన యాశాభంగమునకు మేరలేకుండెను మొదట యీ వార్తను నమ్మలేదుగాని, యెట్లైనను అందలి సూనృతమునుగూర్చి యెవరిని తరచి ప్రశ్నింప లేదు అది నిజమేయైనచో ఆతని లజ్జపాటునకు అవధి లేదుగదా!

(44-వ పేజీచూడండి)

---

రాలేదు టామ్ నిట్టూర్పువిడిచాడు. సభికులు కూడా "అమ్మయ్య" అనుకున్నారు

"సైతాను నీ మంత్ర శక్తులు మళ్లీ లాగేసుకున్నాడు మళ్లీ ఎప్పుడన్నా అవి నీకు దొరికితే నాకు ఒక తుపాను బాకీఉన్నావని మాత్రం మరిచిపోకేం ఇక పో"

[ఇంకా ఉంది]






ర్వం కోసల రాజ్యాన్ని ఓ రాజుగారు పాలిస్తుండేవారు ఆయనగారికి వినోదాలన్నా, హాస్యమన్నా చెడ్డసరదా హాస్యం చేసేవారు, చెప్పేవారు వుండాలేగాని రాచకార్యాలు వదిలేసైనా సరే తీరిగ్గాకూర్చుని చెవులప్పగించి వినేవారు మరి తగ్గట్టుగానే అతని ఆస్థానంలో విక్రముడనే హాస్యగాడు వున్నాడు విక్రముడు హాస్యం చేశాడంటే, చూసేవారు పొట్టలు చెక్కలయ్యేట్టు నవ్వాల్సిందే! రోజూ రాజుగారు అతనిచేత హాస్యవినోదాలు చేయిస్తూ చూసి ఆనందిస్తూ వుండేవారు

ఇలా వుండగా ఓ నాడు రాజుగారికి, విక్రముని ఒకచిక్కు ప్రశ్నవేసి ఏడిపించాలని బుద్ధి పుట్టింది అంతా సభఅలంకరించి వున్నారు మంత్రి సామంతులతో సభ కళకళలాడుతూవుంది

"ఏమోయ్! విక్రమా! రాణీవారికి శిరోబాధ లేచిందట. ఎద్దుపాలువేస్తే పోతుందని వైద్య శిఖామణులు చెప్పారు ఆ పాలు నీవు తేగల సమర్థుడవని నిన్నే నియమించాను. త్వరగా వెళ్లి తీసుకు రావాలి తేలేకపోయావా! రాణీగారి బాధ అధికమౌతుంది నీకు పురిశిక్షా పడుతుంది ఏమంటావ్" అన్నారు రాజుగారు

ఈమాటలు వినగానే సభంతా స్తంభించిపోయింది గుసగుసలుగూడ బయలు దేరాయి

"రాజుగారికిగాని మతి పోలేదు గదా! అన్నాడొక సామంత రాజు

"లేకపోతే ఏమిటీ విపరీతం! ఎద్దుపాలా! అసలు ఎద్దుకు పాలెక్కడివి ఎప్పుడూ విన లేదు విడ్డూరంగా వుందే!" అన్నాడొక కవిసామ్రాట్ ఇంతకీ తన కవిత్వంలోగాని, లేక, గ్రంథాల్లోగాని ఎద్దు పాలిచ్చినట్టు వుందేమోనని ఆలోచిస్తున్నాడు

"అబ్బే! ఎందు కంత ఆలోచన అంతపెద్ద బుర్రగల రాజుగారే ఎద్దుపాలు తెమ్మన్నపుడు మరి ఎక్కడైనావుంటే వుండవచ్చు నేమో! మనకేంతెల్సు! మనం చూచామా! అన్నాడు ఒక చవట దద్దమ్మ

ఇలా తలాఒకరు మెదడుకు పని చెపుతూనే వున్నారు అసలు ఎద్దు పాలు యిస్తుందా! లేదా! అన్న సంగతే సభామణులకు, అగమ్యగోచరంగానూ, కొఱకరాని కొయ్యమెద్దలాగూ తయారయింది

"సరే రేటికి గడువివ్వండి తీప్పక తీసుకువస్తాను" అన్నాడు విక్రముడు విచారంతో

"ఓ! అలాగే! మాకు కావల్సిందల్లా ఎద్దు పాలు రేపు సాయంత్రంలోగా తీసుకు రావాలి లేకపోతే తెలుసుగా! జాగ్రత" అని నాటికి సభ చాలించారు రాజుగారు

విక్రముడు యింటికి వచ్చేశాడు. వచ్చాడేగాని మనస్సు స్థిమింతగా లేదు ఎలావుంటుంది మనస్థిమితం "రాజుగారికి పిచ్చిగాకపోతే మరేమిటి ఎద్దుపాలు తేవాలిట! ఎద్దుకసలు పాలు వుంటాయా! ఏదో హాస్యం చెప్పగలను గాని యిటువంటి అసాధ్యపుకోర్కెలుకోరితే నేనెలా

చేసేది. అదీగాక యింకముందిలో వీరుడ్ని నేనే కనబడ్డాను రేపట్లోగా తేవాలి లేకపోతే తలతీయిస్తారట. ఎంత చిత్రంగావుంది! ప్రభువులవద్ద కొలువులు యిలానే వుంటాయనుకుంటా! చెప్పింది చేస్తే అమర సౌఖ్యాలు అనుభవింప జేస్తారు లేకపోతే తలలున్నా తీయిస్తారు. ఇంకేమన్నా చేస్తారు. అధికారం వారి చేతులో వుంది ఛీ! వెధవ వుద్యోగాలు" విచారంలోగూడ, చీదరించుకున్నారు విక్రముడు.

"ఏమండోయ్! వంటయింది మడిగట్టుకు భోజనానికి లేవండి" అంటూ వంటింటిలోంచి విక్రముడి భార్య, అలివేణమ్మ బయటకు వచ్చింది వచ్చిచూస్తే ఏముంది. రెండు చేతులతో తలపట్టుకొని, విసుక్కుంటూ కూర్చుని వున్నాడు

"ఏమండీ! ఏం! అలావున్నారు. తలనొప్పిగా వుందా!" అంటూ ఆత్రంగా అడిగింది

"ఆ రాణీగారికి పట్టుకున్న తలనొప్పి, నాకూ పట్టుకుంది కొన్ని రోజులుపోతే నీకూ పట్టుకుంటుంది" అన్నాడు విక్రముడు

"అయ్యో! చోద్యమా! సంగతి చెప్పకుండా కసురుకుంటా రేమిటండీ! ఇంతకీ రాజుగారేమైనా అన్నారా!" అంది మళ్లా అలివేణమ్మ

"ఏమైనా అంటారు! ఏముంది! రాణిగారికి శిరోబాధ లేచిందట దానికి ఎద్దుపాలు గావాలిట అవి నేనే స్వయంగా తీసుకెళ్లి రేపట్లోగా సమర్పించుకోవాలి లేకపోతే మొండెంనుంచి తల వేరు" చేస్తారట అని జరిగిన సంగతంతా చెప్పేశాడు భార్యతో.

అలివేణమ్మ కాస్సేపు నిర్ఘాంతపోయింది. తర్వాత ఆలోచించి ఎలాగైనా రాజుగారికి తగిన బుద్ధిచెప్పాలని నిశ్చయించుకుంది అలివేణమ్మ మొత్తానికి చాలా తెలివికలది ఎంతటి చిక్కుప్రశ్నలనైనా యిట్టే యుక్తిగా విడదీయగలదు.

"ఓస్! యీపాటి దానికేనటండీ! ఏమిటలా బెంగపడిపోతారు. నేనంతా సరిచేస్తాగా! మీరు భోంచేయండి' వెధవది చిన్న విషయం. దీనికోసం తెగ ఆలోచిస్తున్నారు" అంటూ వంటింటిలోకి పోయింది

విక్రముడి కేమీ అర్థంకాలేదు కొంపదీసి రాజుకు పట్టిన పిచ్చిగాని దీనికిగూడ పట్టిందా! ఏమిటి! గొడవ అనుకున్నాడు సరే ఎలాగైనా సరి చేసుకోనియ్యి దీనికమట్టుకు ఏంచేతవుతుంది పాలు తేవడం నేను రేపు ఎలాగా ప్రాణాలకు తిలోదకాలు యివ్వకోవడం ఖాయం అనుకొని, పొట్టనిండా తిని దర్జాగా పడుకున్నాడు.

ఇక అలివేణమ్మ ఆలోచనలో మునిగిపోయింది ఆరో జలా గడిచిపోయింది మర్నాడు, భర్తను ఎక్కడకూ వెళ్ళవద్దని చెప్పి, తను మంచిఖరీదైన ఆభరణాలు వస్త్రాలు ధరించి, ఒక బట్టలమూట చంకన పెట్టుకొని బయలు దేరింది. అలా వెళ్తూ రాజుగారి అంతపురానికి ఎదురుగావున్న కోనేరువద్ద ఆగింది బట్టలమూట విప్పి, ఒక్కొక్కటీ కోనేరులో ముంచి ఒడ్డునవున్న బండమీద బాదడం మొదలు పెట్టింది కొంత సేపటికల్లా రాజుగారు చల్లగాలికని మేడమీదికి వచ్చి బయటి ప్రకృతిశోభ తిలకిస్తూ వున్నారు. ఇంతలోకే అలివేణమ్మ బట్టలు వుతకడం కూడ రాజుగారి దృష్టిలోపడింది చూడగానే రాజుగారు ఆశ్చర్యపోయారు. ఎందుకూ! చూస్తే పెద్దింటిపిల్లలాగుంది బట్టలు వుతుకుతుంది ఏమిటా అని. సరే సంగతి సందర్భాలు తెలుసుకుందామని, యిద్దరు భటుల్ని పిలిచి "ఆ కనబడే అమ్మాయిని నా వద్దకు తీసుకురండి" అని వుత్తర్వు చేశాడు.

కాసేపటికల్లా వెళ్ళిన భటులు అలివేణమ్మతో సహా హాజరయ్యారు. రాజగారు అలివేణమ్మను చూడగానే ఆశ్చర్యపోయారు, ఇంత అందమైన యువతి బట్టలు వుతికే గ్రహచార మేమి కల్గిందా అని సరే! భటుల్ని పంపించేసింతరువాత "అమ్మాయ్! చూస్తే నీవు ఒమిందాకులయింట్లో పుట్టిన కన్యలా వున్నావు కాని, నిండు జవ్వనివి. యిలా బయటకు వచ్చి చాకలిపని చేసే అగత్యం ఏమొచ్చింది? యింటిలో నౌకర్లూ చాకర్లూ ఎవరూ లేరా? ఏమిటి సంగతి!" అన్నారు రాజావారు అలివేణమ్మ విచారంగా ముఖంపెట్టి "ప్రభువులవారు మన్నించాలి మాకు నౌకర్లు ఎవ్వరూ లేరండి కాకపోతే ఒక నౌకరున్నాడు. అతను మొన్న పురుడు పోసుకోడానికి పుట్టింటికి వెళ్లాడండి! ఇంతలోకే కొంప మునిగిపోయినట్లు నా భర్తగారు కూడ ఇంటలో మగశిసువును ప్రస

పించారు నౌకర్లా లేరు! మైల బట్టలు అలా వుండిపోతాయని విధి లేక నేనే పట్టుకొచ్చానండీ త్వరగా ఆజ్ఞయిస్తే యింటికి వెళ్తాను మా ఆయన ఒక్కరే వున్నారు చంటివాడు గోల పెడుతూ వుంటాడు" అంది అలివేణమ్మ

ఈ మాటలు వినగానే రాజుగారికి నోటంట మాట పూడిరాలేదు. "ఆరి దేవుడోయ్! లోకంలో ఎంతేసి ఆశ్చర్యకరమైన విషయాలు జరుగుతున్నాయి కాల విపరీతం కాకపోతే! మగవారు పిల్లల్ని కనడం నేనెక్కడా చూడలేదు వినలేదు కూడనూ! లేకపోతే మీ ఆయన "మాంధాత" తమ్ముడా! ఏమిటీ!" అన్నారు రాజుగారు అలివేణమ్మ సమయం చూసి చల్లగా అటించింది "పిల్లల్ని కనే మగవారు ఎందుకు లేరు ప్రభూ! చూస్తూ వుంటే భూగోళమే తల్లక్రిందులై చిత్రవిచిత్రంగా మారిపోతూవుంది అంతా కలికాలం తీరు! ప్రపంచంలో ఎద్దుపాలు కావాలనే మూర్ఖపు రాజులు ఎంతకాలంవరకు వుంటారో అప్పటివరకూ పిల్లల్ని కనే పురుషులున్నారంటే అందులో ఆశ్చర్యపడవలసిన విశేషమేముంది ప్రభూ!" అంది చల్లగా.

కొనమాటలు వినగానే రాజుగారు కొయ్యబారిపోయారు ఈనిడ విక్రముని భార్య ఐయుంటుందనుకున్నారు సంగతి సందర్భాలన్నీ తెలుసుకున్న తరువాత ఆమె తెలివితేటలకు మెచ్చుకొని, గొప్ప బహుమానమిచ్చి, పంపించేశాడు నాటినుంచి యథాలాపంగా విక్రముడు సభకు వస్తున్నాడు రాజుగారు యింకెప్పుడూ అటువంటి తెలివితక్కువ చొప్పదంటు ప్రశ్నలు వేయక హాయిగా రాజ్యం చేస్తూ వున్నారు తర్వాత విక్రముని భార్య పేర ఒక గ్రామం వ్రాసి యిచ్చేశారు ఏమిటో అనుకున్నాను నా భార్య చాలా తెలివిగలదే! నా ప్రాణం కాపాడింది అందుకనే యింటిలో ఏ విషయానైనా నా భార్య సలహా తీసుకుంటూవుంటే చాలా మంచిది!" అనుకున్నాడు విక్రముడు నాటినుంచి భార్య సలహాలను పొందుతూ హాయిగా జీవిస్తున్నాడు విక్రముడు. ★

## హిందూదేశస్తుని కుక్క

(32 వ పేజీ తరువాయి)

కుక్కతో వాళ్లు వెళ్లాలనుకున్నారు కాని, దానితో వాళ్లు వెళ్ళలేదు వాళ్లు కుక్క రాకని చూస్తూ ఇంటివద్దే ఉండిపోయారు

అరగంట గడిచింది కుక్క రాలేదు క్షణం ఓ యుగంలా గడుస్తోంది గాభరాపడుతూన్న డెరిక్కు అమ్మా నాన్నకు కాని, మరో అరగంట సరికల్లా కుక్క తోకాడించుకుంటూ సంతోషంతో ఇంటికి వచ్చేసింది.

"అదుగో! కుక్క వచ్చేసింది! పిల్లాణ్ణి చూసే వచ్చింది" అన్నాడు హిందూ దేశస్థుడు

"ఎక్కడ?" అంటూ లేచాడు డెరిక్కు నాన్న

"పదండి కుక్కతో మనం ఇప్పుడు వెళ్దాం." అన్నాడు హిందూ దేశస్థుడు

కుక్క చూపించిన దారిగుండా వాళ్లు వెళ్లారు వెళ్లేసరికి ఆశ్చర్యం. ఓ కుప్పకింద డెరిక్కు కనబడ్డాడు! చలితో, ఆకలితో ఇంచుమించు చచ్చినట్టు పడున్నాడు

వెంటనే వాళ్ళు ఇంటికి తెచ్చి కావలసిన ఉపచారాలు చేశారు. కొద్దిసేపటికి డెరిక్కు తెప్పరిల్లి మామూలు మనిషయ్యాడు

డెరిక్కు అమ్మా, నాన్నల సంతోషానికి మేరలేదు కుక్క చేసిన మహోపకారానికి ఎంతో మెచ్చుకున్నారు అటువంటి గొప్ప కుక్కని తనవద్దవుంచుకుని తమకు సహాయం చేసినందుకు ఆ హిందూ దేశస్థుని ఎంతో కొనియాడారు

కాస్త మేజోళ్లూ జోళ్లూ చూపి పిల్లాడని వెదకమని సంజ్ఞ చేసినంత మాత్రంలో, ఎందరో మనుష్యులు ఎంత ప్రయాసపడి వెదికినా కనబడని పిల్లాణ్ణి కుక్క నిమిషాల్లో చూపెట్టిందంటే ఎంత ఆశ్చర్యకరమైన విషయం!



"ఈ కాలంలో ఆడమనుషులు సులభంగానే మగ మనుషులలాగా ప్రవర్తించగలుగుతున్నారు గాని, పెద్ద మనుషుల్లే ప్రవర్తించటానికి చాలా కష్టపడుతున్నారు" —కోంప్టన్ మెకంజీ

# ఇద్దరు రాకుమారులు

(39-వ పేజీ తరువాయి)

దున ఆ బిడ్డను బెంచుకొనుటకు చాల నుత్సహించెను

ఈ బాలునకు మూడు సంవత్సరములు నిండుసరికి రాజుగారి మూడవభార్య మరల నొక శిశువును బ్రసవించు నను కొనుచుండిరి రాజు పూర్వమువలెనే యామెపై మిక్కుటమగు ప్రేమను, శ్రద్ధను గనుబరచుచుండెను. అది యంతయు గడమ యిరువురికి అసూయాజనకముగా నుండెను ఈపర్యాయముగూడ వారు మంత్రసాని సాయముతో తమ పన్నాగమును నెరవేర్చిరి. తన భార్య రెండవసారిగూడ నొకనల్లని కుక్కపిల్లను గనిన దనువార్త విని రాజు చాలకోపము చెందెను ఆతడు తనభార్యను దుర్భరదారిద్ర్యమున గ్రుంగి కృశింపవలసినదానిగా నిశ్చయించెను. రాజుగారి భార్య కనిన రెండవశిశువు వడ్రంగి వాకిటి గుమ్మముపై త్యజింపబడి అటుతరువాత నా వడ్రంగిచేతనే పెంచబడుచుండెను అందుచే నిరువురు రాకొమరులు నిప్పుడొక్కచో నుండిరి ఈలోపుగా రాజుగారి భార్య రెండు కుక్కపిల్లలను కన్నదన్న వార్త నలుమూలల వ్యాపించి రాజునకు దుర్భరవ్యథ కలిగించెను.

రాకొమరులిద్దరు దినదినాభివృద్ధి చెంది దేశమునందలి బాలు అందరిలో గణింపదగిన వారుగా నుండిరి వారి పెంపుడుతండ్రియైన వడ్రంగి కొయ్యగుఱ్ఱమును నిర్మించి దాని కాళ్ళకు చక్రములమర్చి దానిపై నెక్కి యాడుకొనుడని వారికిచ్చెను ఒక రాకుమారుడు దానిపై నెక్కి కూర్చుండగా రెండవయాతడు గుఱ్ఱమును బజారులోని కీడ్చుకొని పోయెను అందరు బాలురవలెనే వారను అదియొక నిజమైన గుఱ్ఱముగానే యెంచి దానిని తిన ద్రావ బెట్టుచుండిరి వారి యాటవస్తువగు గుఱ్ఱమేమియు దినకుండుట చూచి వారు తమ సంరక్షకుని కీ విషయ మెరింగింతురు వారి యమాకత కాతడు మిగుల సమ్మోదము చెంది వారితో నిట్లనును "ప్రియతములారా! మన దేశపు రాణి కుక్కపిల్లలను గనినదన్నమాట యెంతనిజమో మీగుఱ్ఱము తిని త్రావగలదన్న మాటగూడ నంత సత్యము"

ఒకరోజున రాకుమారు లిద్దరూ వీధిలో ఆడుకొనుచుండగా రాజుగారు గుఱ్ఱముపైనెక్కి ఆ దారినే వచ్చుచుండిరి వారి ఆకార గౌరవము వలన రాజావంక కాకర్షింపబడెను అట్టి బిడ్డలు తనకు గలరేని తానెంత ధన్యుడ నగుదునని యాతడు తలపోసెను "మీరు నాతోవచ్చి మా మేడలో నాతో పాటు నివసింతురా? నా కుమారులుగనే మీరు మెలగవచ్చును" అని రాజుగారనిరి. "వీలుపడదు మా కిక్కడ హాయిగా నున్నది" అప్పుడు బాలురిద్దరిలో పెద్దవాడు తన జేబునుండి యొక తీపి తినుబండారమునుదీసి కొయ్య గుఱ్ఱము నోటి కందించెను ఆతని తమ్ముడు ఒక గిన్నెలో నీరు తెచ్చి గుఱ్ఱమును ద్రావుమని కోరెను రాజిదంతయు చూచుచు చాల అబ్బురపాటుచెంది వారితో నిట్లనెను "ఆటవస్తువైన యీ గుఱ్ఱము తినుటయు, త్రావుటయు సంభవమని తలచుటకు మీరెటువంటి మూఢులై యుండవలయును" అంత నా బాలురలో పెద్దవాడు రాజువంక జూచి, "ఈదేశపు రాణి రెండు కుక్కపిల్లలను గనుట సంభవమైనదో, నా కొయ్య గుఱ్ఱముగూడ తినుటయు, ద్రావుటయు సంభవమే యగును!"

బాలుని యీ సమాధానము చాలసేపు రాజు నాలోచనలో పడవేసెను వెంటనే యాతడు నిజభవనమునకు తిరిగివచ్చి మంత్రులను బిల్చి వారికీ విషయమంతయు నెరుకపరిచెను వారి నిట్లడిగెను "రాణి రెండు కుక్కపిల్లలను గనియుండెననుమాట నిజము కాగలదా?"

"మహారాజా! అది అసంభవమని తమతో చెప్పుటకు మేము సాహసింపలేదు. ఆ వార్త తమ చెవులబడినప్పుడు తమ యాగ్రహమునకు మేరలేకుండెను అటులెన్నటికని జరిగియుండదు రాజభవనమునందలి వారిలో గొందరు మీ కొక వారసుడు పుట్టనుండుటకు చాల నీర్ష్య చెందియుండవచ్చును. అట్టివారి పన్నాగమే యిది" అని మంత్రులు పలికిరి

ఆ విషయము వెంటనే తేల్చవలసినదిగా రాజు వారిని శాసిం

అది యిటు లుండగా నిక్కడ శిశుప్రగతి యేమయినదో చూడవలయునని మర్నాడు ఉదయము వడ్రంగి నిదురనుండి లేచి అంత

# డైరీ

(6-వ పేజీ తరువాయి)

సమాలోచనలు జరిపి, మద్రాసు రాష్ట్ర చేనేతకాంగ్రెస్‌వారు సత్యాగ్రహం విరమించారు

—అవసరవస్తు సామగ్రిపైన అమ్మకపు పన్నులు తీసివేస్తేగాని ధరలు తగ్గవని భారత ఆర్థిక శాఖ స్టేట్‌మంత్రి మహావీర త్యాగి మద్రాసు హోటల్స్ ఎసోసియేషన్ సభలో అన్నారు

—యం రత్నస్వామిగారి అధ్యక్షత క్రిందం మద్రాసు రాష్ట్రంలో డెమోక్రటిక్ పార్టీ ఒకటి స్థాపించబడింది

అందమైన మగబిడ్డ తన రక్షణకు వదలి పెట్టబడినందుకు చకితుడయ్యెను. తనకు సంతానము లేనందునను. రాజభవనమునందలి స్త్రీ పురుషులెల్లరను ప్రశ్నలచే పరీక్ష చేసిరి సత్యమును చెప్పనివారు క్రూరహింసలచే శిక్షింపబడుదురని హెచ్చరించిరి. అట్లు బెదరింపబడిన వారిలో మంత్రసానికూడ గలదు. ఆమె చాల భయపడి జరిగిన యావద్విషయము బయటపెట్టెను. కాని తనను క్షమించవలసినదిగా నామె వేడుకొనెను ఆమె రాకుమారులను చంపని కారణమున విడిచిపెట్టబడెను కాని రాజుగారి మొదటి యిరువురు భార్యలు బహిరంగముగా నవమానపరుపబడి శిక్షింపబడిరి అంతట రాజు తన మూడవభార్యను రావించి ఆమె తోడను, తన యిరువురు కుమారులతోడను సుఖముగా జీవించెను. కాని యాతడు తన తొందరపాటునకును ప్రేమార్హురాలైన మూడవ భార్యను నిష్కారణముగా శిక్షించినందులకును జీవితాంతము పరితపించెను. ★

శుక్రవారం, జూన్ 29 :

—కొరియాలో యుద్ధాన్ని విరమించడానికై సంప్రదింపులకు సిద్ధంగా ఉన్నట్లు సమితిసేనాధిపతి జనరల్ రిడ్జివే అమెరికా అధ్యక్షుడు ట్రూమన్ ఆజ్ఞప్రకారం ఉత్తర కొరియన్ కమ్యూనిస్టులకు తెలియపరిచాడు

—రష్యన్ సేనలు యుగోస్లావియా సరిహద్దుకు చేరుకున్నట్లు బెల్‌గ్రేడ్ వార్త

—ఆంగ్లో-ఇరానియన్ ఆయిల్ కంపెనీలోని బ్రిటిష్ ఉద్యోగులు వెళ్ళిపోమని వాగ్దాన మిచ్చేపత్రంలో, విధ్వంసకచర్యలకు సంబంధించిన శాసనాన్ని వాయిదా వెయ్యగలడని పర్షియా ప్రధాని డా॥ ముసాదిక్ ప్రకటించాడు

—పర్షియన్ ఆయిల్ గురించి బ్రిటిష్ ప్రభుత్వం చేసిన ఫిర్యాదును విచారించే అధికారం అంతర్జాతీయ సంస్థకు లేదని పర్షియన్ ప్రభుత్వం హేగ్ కోర్టుకు తెలియచెప్పింది

—120 మంది జర్మన్ విజ్ఞానశాస్త్ర నిపుణులు ఆయిల్ పరిశ్రమలో పని చెయ్యడానికి పర్షియన్ ప్రభుత్వానికి దరఖాస్తులు పంపారని టెహరాన్ ప్రభుత్వం ప్రకటించింది

—అమెరికా ఆర్థిక సహాయపు ఒడంబడికపైన వియత్నమ్ ప్రభుత్వప్రతినిధి సంతకం పెట్టలేదు ఫ్రెంచి ప్రభుత్వం ఆక్షేపణ తెలిపినందువల్ల ఇలా జరిగిందని చెప్పబడింది

—మూడు పాకిస్తాన్ విమానాలు పక్తూనిస్తాన్‌కు చెందిన ఒక గ్రామంపైన దాడి చేశాయని కాబూల్ రేడియో ప్రకటించింది

—గత ఏభై ఏళ్ళలో ప్రపంచంలో జనాభా 82 కోట్ల 57 వేలు పెరిగిందనీ, అన్ని దేశాలలోకి భారతఖండంలో పెరుగుదల అత్యధికమనీ ప్రపంచ ఆరోగ్యసంస్థ ప్రకటించింది

—స్త్రీలకు పురుషులతో సమానంగా వేతనాలు చెల్లింపబడాలనే తీర్మానాన్ని అంతర్జాతీయ కార్మికసంస్థ సర్వసభ్య సమావేశం (జినీవాలో) ఆమోదించింది

—కాశ్మీర్ సైనిక సమస్య పరిష్కారం కోసం సమితి నియమించిన డా॥ ఫ్రాంక్ గ్రాహం కరాచీవచ్చారు

—తూర్పు బెంగాల్ నుంచి వలస వస్తున్న శరణార్థుల సంఖ్య హెచ్చిందని పశ్చిమబెంగాల్ ముఖ్యమంత్రి డా॥ బి సి రాయ్ ప్రకటించారు

—భారతదేశంలో ప్రారంభించబడిన నదీజలాల ప్రాజెక్టులకు మొత్తం రు600కోట్లు ఖర్చవుతుందని శ్రీ ఏ యన్ ఖోస్లా రేడియో ప్రసంగంలో తెలిపారు

శనివారం, జూన్ 30

—కొరియాలో శాంతిస్థాపనకు గాను అమెరికన్ ప్రభుత్వం ఏడు అంశాల ప్రతిపాదన ప్రకటించింది

—అబడాన్ ఆయిల్ యంత్రాగారాలను మూసివెయ్యవలసి వస్తుందని బ్రిటిష్ ప్రభుత్వం పర్షియన్ ప్రభుత్వాన్ని హెచ్చరించింది

—థాయిలాండ్ ప్రభుత్వంపైన నౌకాదళం తిరుగబడి ప్రధాని ఫిబున్ సంగ్రామ్‌ను అరెస్టుచేసింది రాత్రివేళ నౌకా కార్యాలయంపైన సైనిక విమానాలు బాంబులు వేసినట్లు వార్త వచ్చింది

—వేరుసెనగపప్పుపై ఎగుమతి సుంకాన్ని రు 80 నుంచి రు 150 కు ఇతర నూనె గింజలపై ఎగుమతి సుంకాలను రు 150 కు, నూనెలపై ఎగుమతిసుంకాన్ని రు 300 కు పెంచినట్లు భారతప్రభుత్వం ప్రకటించింది

—మద్రాసు మునిసిపల్ సంస్కరణల విచారణసంఘం నివేదికను మద్రాసు ప్రభుత్వం ప్రచురించింది

—చెన్నరాష్ట్రంలో ఈ సంవత్సరం మామూలుకంటె 14 లక్షల 70 వేల టన్నులు తక్కువగా ధాన్యాలు పండుతాయని అంచనా వేసినట్లు మంత్రి నిర్లక్ష్యరియాగారు ఆహారపరిస్థితిని సమీక్షిస్తూ చెప్పారు

—రానున్న ఎన్నికల్లో ఏ పార్టీలు ఏ చిహ్నాలను ప్రచారం చెయ్యాలో నిర్ణయించడానికి మద్రాసు ప్రభుత్వ కార్యాలయంలో మంత్రి గోపాలరెడ్డిగారి అధ్యక్షత క్రింద వివిధపార్టీల ప్రతినిధులు సమావేశమైనారు ★

## పుస్తకములు

గ్రామకరణము, మునసబు అండ్ సర్వేపరీక్ష పుస్తకములు కావలసినవారు ఈదిగువ చిరునామాకే వ్రాయవలెను నా పేరిట గుంటూరుకు వ్రాయకూడదు ఇట్లు బలేమర్తి నాగభూషణరావు (S/o Late Lakshminarasimham) బాలేమర్రుపోస్టు గుంటూరు జిల్లా

# పారిస్ సమాలోచనలు

(4-వ పేజీ తరువాయి)

ఈ ప్రమాదాలను, ప్రపంచానికి మరొక యుద్ధప్రమాదాన్నీ, జర్మనీని సైనికంగా బలపరిచే ప్రమాదాన్నీ నివారించడంకోసం నాలుగు అగ్రరాజ్యాల విదేశాంగ శాఖా మంత్రులూ సమావేశమై చర్చించాలని రష్యా సూచించింది ఈ సందర్భంలో రష్యావల్ల పశ్చిమదేశాలకు ప్రమాదం కలుగుతున్నదనే ఆరోపణను రష్యా ఖండించి, అన్యదేశాలను ఆక్రమించుకునే తలపు రష్యాకు లేదని రష్యన్ ప్రభుత్వం స్పష్టంగా చెప్పింది

అయితే ఇదివరలో విదేశాంగమంత్రుల సమావేశాలేవీ ఫలప్రదం కానందువల్ల ఇప్పుడటువంటి సమావేశం జరపాలంటే, చర్చించవలసిన విషయాలేవో డిప్యూటీ మంత్రులు చర్చించి నిర్ణయించడం అవసరమని పశ్చిమదేశాలు మూడూ తెలిపాయి దీనికి రష్యా సమ్మతించడంతో పారిస్‌లో మార్చి నెలారంభంలో అమెరికన్, బ్రిటిష్, ఫ్రెంచి, రష్యన్ విదేశాంగ శాఖల డిప్యూటీ మంత్రులు సమావేశాలు ప్రారంభించారు

చర్చనీయాంశాలలో ఏ అంశాలను చేర్చాలనే విషయంపైన అంగీకారం కుదరడం అసంభవమని ఆరంభంలోనే తెలిసిపోయింది జర్మనీ ఆయుధబల నిర్మాణాన్ని గురించి చర్చించాలని రష్యన్ ప్రతినిధి సూచించారు కాని అది ప్రధానం కాదనీ, రష్యా విధానంవల్ల సంభవిస్తున్న ప్రచ్ఛన్న సంఘర్షణకు అది ఫలితంమాత్రమేననీ వాదించి, ప్రచ్ఛన్నసంఘర్షణకుగల కారణాలు, ఫలితాలనుగురించి చర్చించాలని అమెరికన్ బ్రిటిష్, ఫ్రెంచి ప్రతినిధులు ప్రతిపాదించారు

కార్యక్రమం గురించి ఈవిధంగా దీర్ఘ సమాలోచనలు జరిగాయికాని సమాధానం కుదరలేదు ఎలాగైనా సమాధానం కుదరనివ్వకూడదని పశ్చిమదేశాల ప్రతినిధులు ప్రయత్నించినట్లు పాశ్చాత్యేతర జకీయవేత్తలే స్పష్టంగా చెప్పకున్నారు ఈపరిస్థితిలో సమాధానం కుదిరిన అంశాలు కొన్నిటినీ, కుదరని అంశాలు కొన్నిటినీ విడగొట్టి మూడురకాల కార్యక్రమాల్ని పశ్చిమదేశాలప్రతినిధులు తయారుచేశారు తయారుచేసి డిప్యూటీమంత్రుల చర్చలను నిర్లక్ష్యపరిచి స్వయంగా రష్యన్ ప్రభుత్వాన్ని ఈ కార్యక్రమాలలో ఏదో ఒక దానిని అంగీకరించమని విజ్ఞప్తిచేశారు అంగీకరించినట్లయితే జూలై 23వ తేదీనుంచి విదేశాంగమంత్రుల సమావేశాన్ని వాషింగ్‌టన్‌లో జరపవచ్చునికూడా చెప్పారు దీనితో అగ్రరాజ్య విదేశాంగమంత్రుల సమావేశం జరగకుండా రష్యాయే నిరోధించింది అని ప్రపంచంలో ప్రచారం చెయ్యవచ్చునని ఆశపడ్డారు కాని రష్యా సమాధానంతో పరిస్థితి తారుమారయింది అట్లాంటిక్ పాక్టునీ, పరాయిదేశాలలో అమెరికా స్థాపిస్తున్న సైనిక స్థావరాల్నీ కూడా చర్చనీయాంశాలుగా చేర్చినట్లయితే తప్పకుండా పాశ్చాత్యుల కార్యక్రమానికి వాషింగ్‌టన్ సమావేశానికీ సమ్మతించగలరని రష్యన్ ప్రభుత్వం తెలిపింది పై రెండు అంశాలనూ అంగీకారం కుదరని చర్చనీయాంశాలుగా పరిగణించినా అభ్యంతరం లేదని రష్యన్ ప్రభుత్వం ప్రకటించింది అట్లాంటిక్ పాక్టును చర్చించడానికి ఎన్నడూ అంగీకరించబోరని బ్రిటిష్ అమెరికన్ ఫ్రెంచి ప్రతినిధులు ప్రకటించారు అయితే పారిస్ సమావేశాలను ఎప్పటిమాదిరిగా కొనసాగనివ్వవచ్చునని రష్యన్ ప్రభుత్వం సూచించింది చివరికి పశ్చిమదశాలే నిరాకరించక తప్పిందికాదు

జర్మనీ సమస్యనుగురించి విస్పష్టంగా చర్చించాలన్నప్పుడు అంగీకరించక అస్పష్టమైన అంశాలను సూచించిన పశ్చిమరాజ్యాలు, ఈ అస్పష్టమైన అంశాలలో అట్లాంటిక్ పాక్టుకూడా చేరుతుందని తెలుసుకునేసరికి మార్గాంతరం లేకపోయింది బాల్కన్ దేశాలతో రష్యా చేసుకున్న ఒడంబడికల్ని కావలిస్తే చర్చించవచ్చునని రష్యా సూచించింది కూడా అయినా పశ్చిమదేశాలు నిరాకరించక తప్పలేదు చివరికి పారిస్ సమావేశం పశ్చిమదేశాల రష్యన్ ప్రతికూల ప్రచారానికికూడా వినియోగపడలేదు

వాస్తవానికి జర్మనీ ఆయుధబల నిర్మాణం బ్రిటన్ ఫ్రాన్సులకు సమ్మతం కాదు అయినా అమెరికా ఒత్తిడికి లొంగి ఈ రీతిగా జర్మనీ బల నిర్మాణానికి పాల్గొనడం వింతగానే కనపడుతుంది జర్మనీ బలనిర్మాణాన్ని విరోధించాలనే ఆశతో, ఎలాగైనా అగ్రరాజ్య చతుష్టయ విదేశాంగమంత్రుల సమవేశం జరపాలనే ఆశతో బ్రిటన్ ఫ్రాన్సులు పారిస్ సమావేశానికి సమ్మతించాయి కాని పారిస్ సమావేశం ప్రారంభమైన నాలుగు మాసాలలో జర్మనీ పారిశ్రామికవస్తు సంపదను ఆయుధబలనిర్మాణానికి అమెరికా వినియోగించడం ప్రారంభించారు పశ్చిమ జర్మనీలో సైనికబలం కూడా నిర్మించబడుతోంది ష్యూమన్ ప్రణాళిక ఆమోదించబడింది బ్రిటిష్, ఫ్రెంచి ప్రభుత్వాలు, తదితర అట్లాంటిక్ పాక్ట్ దేశాలు ఆయుధ, సైనికబల నిర్మాణానికి కార్యక్రమాలేర్పాటు చేసుకోడం పూర్తయింది ఇంకా అట్లాంటిక్‌పాక్ట్ పేరుతో రక్షణ సన్నాహాలకు, యుద్ధ సన్నాహాలకు సిద్ధపడక తప్పదని బ్రిటిష్ ఫ్రెంచి ప్రభుత్వాలు నిర్ధారణ చేసుకున్నాయి పశ్చిమ జర్మనీకూడా చేరినట్లే భావించి, ఆప్రకారం ఇంక అట్లాంటిక్ పాక్ట్ దేశాల రక్షణవ్యూహాలను, యుద్ధవ్యూహాలను అమెరికా నిర్ణయిస్తున్నందువల్ల ఇంక రష్యన్ ప్రతినిధులతో శాంతి సమాలోచనలు జరిపి ప్రయోజనం లేదని బ్రిటన్ ఫ్రాన్సులకు తెలిసిపోయింది అందువల్లనే మొదట పారిస్ సమావేశంలో సుముఖభావంతో ప్రవేశించిన బ్రిటన్ ఫ్రాన్సులు నిరాశతో రష్యాతో సఖ్యత సంప్రదింపులకు నీళ్లు వొదులుకోవలసి వచ్చింది అందువల్ల ఈనాడు జర్మనీ ఆయుధబల నిర్మాణానికి తలొగ్గినా, పారిస్ సమాలోచనలు విఫలమైపోయినా, ఇది బ్రిటన్ ఫ్రాన్సులకు పరాజయమని పరిగణించక తప్పదు

# హైదరాబాద్ కాంగ్రెస్ వైరాలు

దేశమంతటా ఇతరప్రాంతాలలో వచ్చినట్లే హైదరాబాద్ కాంగ్రెస్‌లోనూ వైరాలు ఉత్పన్నమైనాయి వైరాలను పైకి పొక్కనివ్వకుండా ఏదో మాదిరిగా సఖ్యత చేకూర్చాలని కేంద్రనాయకులు చేసిన యత్నాల ఫలితంగా ఢిల్లీ ఒప్పందం అనే తాత్కాలికపు ఏర్పాటొకటి జరిగింది కాని ఇది ఆట్టే కాలం నిలవదని అందరికీ తెలిసినదే ఇప్పుడు తిరిగి ఈ వైరాలు పైకి పొక్కి ఎలెక్షన్‌కమిటీ నిర్మాణంలో ప్రతిష్టంభన ఏర్పడిందంటే కారణం ముందు జరగనున్న ఎన్నికల్లో పదవులకోసం కీచులాట ఇదికాక భాషారాష్ట్రనిర్మాణ సిద్ధాంతంగురించి వారిమధ్య కల అభిప్రాయభేదాలుకూడా ప్రస్తుత వైరాలకు కారణమని తెలుస్తోంది జరగబోయే ఎన్నికల్ని దృష్టిలో ఉంచుకునే హైదరాబాద్ కాంగ్రెస్ కార్యవర్గం భాషారాష్ట్ర విభజన సిద్ధాంతాన్ని విశ్వసిస్తున్నట్లు ఇదివరకు తీర్మానం చేసింది కాని పైకి ఎంతగా ఈసిద్ధాంతాన్ని ఆమోదిస్తున్నట్లు చిలకపలుకులు పలికినా, తెలంగాణా విభజనకు అన్యప్రాంతీయులు ప్రతికూలంగా వ్యవహరిస్తున్నారు హైదరాబాద్ కాంగ్రెస్‌ని

ఏకసంస్థగా అఖిలభారత కాంగ్రెస్‌లో ఉండాలా లేక మూడు భాషాప్రాంతాలకు మూడు ప్రదేశ్ కాంగ్రెస్‌లను అఖిలభారత కాంగ్రెస్‌లో చేర్చాలా అనే విషయమై భేదాభిప్రాయం ఏర్పడ్డానికి ఈ గొప్ప ప్రతికూలభావమే కారణం. చెన్నరాష్ట్రంలో, ఆంధ్ర, తమిళ, కర్నాటక కేరళ కాంగ్రెస్‌లు విడివిడిగా ఉన్నట్లే హైదరాబాద్‌లో తెలంగాణా మరాఠ్వాడా కన్నడ ప్రాంతాలకు విడివిడిగా ప్రదేశ్ కాంగ్రెస్‌లు ఎందుకు ఏర్పడకూడదో బోధపడదు. ఈ మూడింటికీ హైదరాబాద్ కాంగ్రెస్ ఒక మాతృసంస్థ, హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెస్‌కి అఖిలభారత కాంగ్రెస్ మరొక మాతృసంస్థగా ఎందుకుండాలో తెలియదు. దీనివల్ల ప్రత్యేక ప్రయోజనమేదీ ఉండదు. హైదరాబాద్ కాంగ్రెస్ అనేది లేకుండా మూడు ప్రాంతాలకూ మూడు ప్రదేశ్ కాంగ్రెస్‌లను విడిగా ఉంచడం అవసరం కూడా.

ఇలాటి ఏర్పాటువల్ల కాంగ్రెస్‌లో విభేదాలు పెరుగుతాయని భయపడడం మాత్రం అవివేకం. కాంగ్రెస్‌లో ఐక్యతకీ దీనికీ ఎటువంటి సంబంధం లేదు. దేశమంతటా కొన్ని నాయకవర్గాలు చేరి కేంద్రంనుంచి ప్రదేశ్ కాంగ్రెస్‌లవరకూ గొడవలేసి కక్షలు తెస్తారని ఎవరూ అనుకోరు. అటువంటి కుట్ర ఏదీ లేకుండానే దేశమంతటా ప్రతి ప్రాంతంలోనూ కక్షలేర్పడినాయంటే కాంగ్రెస్ సంస్థ నిర్మాణంలోనో ప్రధానాశయాలలోనో కల లోపాలే కారణాలుగాని తదితరం కావనేది స్పష్టమే. అందువల్ల కాంగ్రెస్‌లో కక్షలకూ హైదరాబాద్ కాంగ్రెస్‌ను భాషాప్రాంత సంఘాలుగా విభజించడానికీ ఎటువంటి సంబంధం లేదని గుర్తించినట్లయితే భాషాప్రాంత సంఘాల ఏర్పాటుకు ఎవరికీ ఆక్షేపణ ఉండదు.

## శ్రీ తెన్నేటి విశ్వనాథం

విశాఖ జిల్లా నియోజకవర్గం నుంచి మద్రాసు శాసనసభా సభ్యత్వానికి రాజీనామా నిచ్చిన శ్రీ తెన్నేటి విశ్వనాథంగారి స్థానే ఒక సభ్యుణ్ణి ఎన్నుకోడానికి ఏర్పాటు చెయ్యబడిన ఎన్నికలో, విశ్వనాథంగారికి ప్రత్యర్థిగా కాంగ్రెస్ పార్టీ ఎవరినీ నిలబెట్టరాదని కాంగ్రెస్ అధ్యక్షులు టండన్‌గారు ఆంధ్ర కాంగ్రెస్‌కి ఆజ్ఞ ఇచ్చారు.

శ్రీ విశ్వనాథంగారు కాంగ్రెస్ పార్టీ నుంచి నిష్క్రమించిన వెంటనే కాంగ్రెస్ వల్ల లభించిన శాసనసభా సభ్యత్వానికి రాజీనామా ఇచ్చారు. అయితే ఈమాటు జరిగే బై-ఎలక్షన్‌లో ప్రజాపార్టీ అభ్యర్థిగా కాక స్వతంత్ర అభ్యర్థిగా నిలిచారు. ఎన్నిక ఇంకా మాసం పైగా ఉండగా విశాఖపట్నంలో విశ్వనాథంగారు, కాంగ్రెస్ పార్టీవారు సభలుచేసి ప్రచారం చెయ్యడం ప్రారంభించారు. కాంగ్రెస్ పక్షాన కళా వెంకట్రావు, సంజీవరెడ్డి, గోపాలరెడ్డి ప్రభృతులు సభలో ఉపన్యాసాలిచ్చారు. అయితే కాంగ్రెస్ అభ్యర్థిని నిర్ణయించడానికి జాగయింది. నియోజకవర్గంలోని ప్రజల వైఖరిని కూడా ఆ నాయకులు గమనించారు. స్వతంత్ర అభ్యర్థిగా నిలబడుతున్నందువల్ల, శాసనసభలో కాంగ్రెస్ పార్టీకో సహకరించడానికి విశ్వనాథంగారు ఒప్పుకునేటట్లయితే కాంగ్రెస్ పార్టీ ప్రత్యర్థిని నిలబెట్టరని కళా వెంకట్రావుగారు ఒక ప్రకటన చేశారు. అటువంటి వాగ్దానం ఇవ్వలేరనీ, శాసనసభలో అనుసరించబడే కార్యక్రమాల గుణాగుణాలనుబట్టి మంచివైతే సహకరించగలరనీ లేకపోతే సహకరించలేరనీ విశ్వనాథంగారు స్పష్టపరిచారు. ఆ పైన ఆంధ్ర కాంగ్రెస్ శ్రీ కందాళ సర్వేశ్వర శాస్త్రిగారిని ప్రత్యర్థిగా నిలబెట్టడానికి నిర్ణయించి, నామినేషన్ దాఖలు చెయ్యవలసిందని శాస్త్రిగారికి తెలియచేశారు. శాస్త్రిగారు నామినేషన్ దాఖలు చేసినతరవాత టండన్‌గారి ఆజ్ఞ వచ్చింది. విశ్వనాథంగారి వరస సక్రమంగా ఉంది కాబట్టి వారిని పోటీలేకుండా ఎన్నుకోబడనివ్వాలని వారి ఆజ్ఞ. ఆ పైన ఆంధ్రకాంగ్రెస్ ఈ ఆజ్ఞను పాలించడం, శాస్త్రిగారు నామినేషన్ ఉపసంహరించుకోవడం జరిగింది. ఇంక విశ్వనాథంగారు పోటీలేకుండా ఎన్నుకోబడతారు.

ఈ సందర్భంలో టండన్‌గారు పాటించిన సూత్రాన్ని అభ్యర్థులూ, వోటర్లు కూడా గమనించవలసిన అవసరం ఉంది. ఎన్నికలలో వోట్లు ఇచ్చే వోటర్లు కాని, అభ్యర్థులను నిలబెట్టే పార్టీలు కాని అభ్యర్థుల గుణగణాలను కూడా గమనించాలి. ఆయా పార్టీల కార్యక్రమాల్ని చూసి ఆ పార్టీల అభ్యర్థులకు వోటు చెయ్యకూడదు. పార్టీల కార్యక్రమాలతోపాటు అభ్యర్థుల గుణగణాలను పరిశీలించాలి. నిజం చెప్పవలసివచ్చినా రెండు అబద్ధాలతోగాని చెప్పలేనివారు, పార్టీలలో చేరి ఆపార్టీల కార్యక్రమాల్ని విశ్వసించక ఆ పైన భగ్నపరిచేవారు, తీరా ఎన్నికైన తరవాత కక్షలు కుతంత్రాలూ తప్ప ఇతర రాజకీయ సేవ నెరుగనివారు అనేకులు ఈనాడు శాసనసభ్యులై వెలుగుతున్నారు. ఇటువంటి సభ్యులవల్ల వారి పార్టీలకే ముప్పు. అందువల్ల వోటర్లు పార్టీలూ కూడా అభ్యర్థుల్ని కూడా గమనించకపోతే ఎన్నికలు పార్లమెంటరీ ప్రభుత్వాలూ నిరర్థకం కాగలవు ★

## కపాలమోక్షం

(7-వ పేజీ తరువాయి)

భిక్ష వెయ్యాలి. కరణం, సీతారామయ్య స్నానంచేసి, ముఖానికి, చేతులకూ విభూతి పూసుకుని, పీతాంబరధరుడై శుచిగావచ్చి స్వామివారియెదుట నమ్రతగా నిలిచారు. ఇంతలో బుచ్చిరెడ్డికూడా వచ్చి ఎర్రగా కాచి కలకండతో శుద్ధిచేసిన గోక్షీరాన్ని స్వామివారి ముందుంచి తను వెనక్కి తొలిగాడు. స్వామివారు ఓసారి ఈశ్వరుణ్ణి ధ్యానించి గోక్షీరాన్ని పుచ్చుకుని బరువుగా త్రేన్చారు. ధన్యుడైనట్లు సంతోషించాడు బుచ్చిరెడ్డి.

స్వామివారు పాత్రను క్రిందపెట్టి కరణంగారివైపు సాభిప్రాయంగా చూస్తూ మందహాసం చేశారు, 'ఏమిటి విశేషం?' అన్నట్లు.

సీతారామయ్య చేతులు రెండూ జోడించి, నమ్రత ఉట్టిపడేటట్లుగా విన్నవించుకున్నారు 'తమరికి యీరోజున మా యింట్లో భిక్ష ఏర్పాటు చేస్తున్నాము. అనుగ్రహించాలి.'

'మీ ఊరివారు మాయందు చూపే భక్తికి చాలా సంతోషిస్తున్నామురా' మళ్లా స్వామివారి ముఖంమీద మందహాసం మెరిసింది. ఆయన అందర్నీ 'ఒరే!' అని సంబోధిస్తారు.

వంటప్రయత్నాలు చేయించడానికి సీతారామయ్య అక్కడినుండి కదిలి వెళ్లిపోయాడు. స్వామివారికే కాకుండా గ్రామస్థులలో భక్తులందరికీ కూడా తన ఆతిథ్యం స్వీకరించి తనను తరింపజెయ్యాలని కోరుకున్నారు కరణంగారు.

ఎంత తొందరగా ముగించాలనుకున్నా, అందరి భోజనాలూ పూర్తయేసరికి అపరాహ్ణం తిరిగింది.

భక్తులు ఒక్కరొక్కరే ఆలయంలో కల్యాణమండపం దగ్గరకు చేరుకుని స్వామివారిని పరివేష్టించి కూర్చున్నారు. తమ కారోజు భుక్తాయాసంగా ఉండడంవల్ల ఉపన్యాసమేదీ యివ్వలేరనీ, స్వామివారు మర్నాటినుండీ

కార్యక్రమం క్రమంగా కొనసాగిస్తారనీ చెప్పాడు శిష్యుడు.

'కాదామరి?' అన్నట్లు భక్తుల తలలన్నీ ఒకసారి ఊగాయి.

'మేము విశ్రమిస్తాం' అన్నారు స్వామివారు, ఆయనకు సహజమైన ఠీవితో.

'అల్లాగే తప్పకుండాను' అన్నాయి భక్తుల కంఠాలు కొన్ని. కాని, స్వామివారి సాన్నిధ్యంనుండి దూరమవడం యిష్టంలేక కాబోలు భక్తు లెవరూ తమ స్థానాల్లోంచి కదలలేదు.

వాళ్లంతా అక్కడ ఉండడం నిర్వి రామానందులవారికి చాలా చిరాగ్గా ఉంది. 'మీరంతా యిక్కడినుంచి వెళ్లండి' ఈసారి సూటిగా చెప్పేరు, భక్తులకర్థమయ్యే భాషలో.

ఈ మాటతో అర్థమయినవాళ్లు అక్కడినుండి లేచివెళ్లడాని కుపక్రమించారు. ఇంతలో ఆలయద్వారంవద్ద పెద్ద కోలాహలం వినిపించింది. భక్తుల నేత్రాలన్నీ ఆవైపు తిరిగాయి. మునసబుగారి వెట్టివాడు పన్నెండేళ్ల కొడుకు శరీరాన్ని భుజంమీద వేసుకుని ఆలయద్వారం ప్రవేశించి లోపల కొచ్చాడు. వాడి బట్టలు రక్తంలో పూర్తిగా తడిసిఉన్నాయి. వాడి స్వరూపం భయంకరంగా ఉంది.

'ఏం జరిగిందిరా, వెంకా?' అన్నాడు మునసబు వెట్టివాణ్ణి ఉద్దేశించి. వెంకడు ఏంజరిగిందో చెప్పలేదు. చెప్పేపరిస్థితిలోనూ లేడు. సావధానంగా కొడుకు శవాన్ని దింపి, స్వామివారికి కనపడేలాగా నేలమీద పడుకోబెట్టాడు. ముఖం పోలిక దొరక్కుండా తల చితికిపోయిందా శవానికి! అప్రయత్నంగా చాలామంది కళ్లల్లో నీళ్లు తిరిగాయి శవాన్ని చూసేసరికి. వెంకడి కళ్లల్లో నీళ్లన్నీ అప్పటికే యింకిపోయాయి. ఇంకా ఏడిస్తే కళ్లల్లోంచి రక్తం కారుతుందేమో నన్నంతగా ఎర్రబడిపోయాయి, వాడికళ్లు. వాడు మాటిమాటికీ జుట్టుపీక్కుంటున్నాడు. ఎవరికీ సమాధానం చెప్పే పరిస్థితిలో లేడు.

మునసబుగారు ఉత్తరీయంతో కళ్లు తుడుచుకున్నాడు. 'అసలేమిటిరా? ఏం జరిగింది?' ఆత్రుతగా మళ్లా ప్రశ్నించేడు.

వెంకడి వెనకఉన్న పల్లెలో ఒకడు ముందుకు వచ్చాడు. 'అది కాదండీ! ఏనుగులు నీళ్ళు తాగడాని కెళ్తూంటే మేమంతా చూస్తున్నామండీ. మేమెవ్వళ్లం ఏమీ చెయ్యలేదండీ. ఆ ఏనుగుల్ని చూస్తూంటేనండీ, పెద్దఏనుగు వెనకనించే వచ్చి వీణ్ణి పడదోసి బుర్రతొక్కేసిందండీ' ఆ కుర్రాడు కూడా వెక్కి వెక్కి ఏడవడం మొదలు పెట్టేడు.

'ఆ పిల్లవాడు చాలా ధన్యుడు' అన్నారు, అంతవరకూ మౌనంగా కూర్చున్న స్వామివారు, ఆయనకు సహజమైన మందహాసంతో.

వెంకడు వెర్రిగా చూశాడు.

వా డెందుకు ధన్యుడో సుగ్రాహ్యంగా బోధపరచే రాయన—'ఎంతో పుణ్యాత్ములకు మాత్రమే కపాలం పగిలి చావు వస్తుంది. కపాలమోక్షం అందరికీ లభిస్తుందటరా!'

వెంకడు స్వామివారి కాళ్లమీద పడ్డాడు. 'తమరు తలుచుకుంటే యీ కుర్రవాణ్ణి బ్రతికించగలరు.' మానవుడు సాధించగలిగిన పనులేవో, కానివేవో విచక్షణాజ్ఞానం నశించింది, వాడికి దుఃఖావేశంలో.

'నిజమే' అన్నారు, స్వామివారు, నిర్వికారంగా.

సభకులంతా విస్తుపోయి చూశారు. ఆయన కంతటి శక్తిఉందే ఉంటుందని వాళ్ల అంచనా.

వెంకడికళ్లు మెరిశాయి. 'ఈడికి ఎలాగైనా పాణం పొయ్యండి, బాబూ! మా యింట్లో తమరి బొమ్మెట్టుకుని పూజ్జేసుకుంటాను.'

'ఏనుగంటే సాక్షాత్తూ ఆ దేవేంద్రుడి వాహనం' నిశ్చలంగా చెప్పుకుపోతున్నారు, స్వామివారు.

అయ్యే ఉండవచ్చు అనుకున్నాడు, పురాణాలు తెలియని వెంకడు. కాని ఎవరి వాహనమైతే వాడకేం ఒరిగింది? వాడికి ప్రస్తుతం తన కొడుకుప్రాణం ముఖ్యం. తన కొడుకును త్వరగా బ్రతికించకుండా యీ పురాణం ఎందుకు చెప్తున్నారో, వాడి కర్థం కాలేదు.

'అటువంటి పవిత్రమైన ఏనుగువల్ల మరణాన్ని పొందగలిగిన నీ కొడుకు సరాసరి స్వర్గానికే వెళ్తాడు.'

'వద్దు బాబూ, వద్దు. ఆణ్ణిక్కడే ఉణ్ణియ్యండి' వెంకడు లబోలబోమని మొత్తుకోడం మొదలు పెట్టేడు.

'శివుని ఆజ్ఞలేనిదే, చీమైనా కుట్టదురా. ఆయన ఆజ్ఞకు వ్యతిరేకంగా ప్రవర్తించడం బుద్ధిమంతుల లక్షణం కాదురా.'

వెంకడి కివేమీ వినపడ్డంలేదు. వినపడ్డంతమట్టుకైనా బోధపడ్డంలేదు. వాడి ఏడుపు మితిమీరిపోతూంది. స్వామివారికి విసుగేసింది. కోపంకూడా వచ్చింది. 'ఛీ, మూర్ఖుడు. చెప్పినా తెలుసుకోలేడు' అని చీదరించుకుంటూ అక్కడినుండి లేచి దూరంగా వెళ్లిపోయారు.

వెంకడు ఏడుస్తూ శవాన్ని భుజంమీద వేసుకుని స్మశానంవైపు దారితీశాడు. ఆ తరువాత ఒక్కరొక్కరే ఆలయప్రాంగణంనుంచి బయటపడ్డారు. పదినిముషాల్లో ఆలయం నిర్మానుష్యమైపోయింది.

సర్వసంగ పరిత్యాగి శ్రీ నిర్వి రామానందస్వామివారు గ్రామంలోకి వచ్చిన మొదటిరోజు గడిచిపోయింది.

* * * *

మర్నాడు మధ్యాహ్నం నిర్ణీత సమయానికి ఆలయంలో స్వామివారు ఉపన్యాసం ప్రారంభించారు. ఆయన భగవద్గీతలోని అంతరార్థాన్ని తెలియజేస్తున్నారు. పందిట్లో కూర్చున్న భక్తులు జాగ్రదవస్థలోనే ఉండి ఉపన్యాస సారాన్ని ఆస్వాదిస్తున్నట్లు తెలియడానికి వాళ్ల ఊగే బుర్రలే తార్కాణం. 'పరిత్రాణాయ సాధూనాం! వినాశాయచ దుష్కృతాం' అని స్వామివారు చదివినప్పుడు సాక్షాత్తూ ఆ శ్రీకృష్ణ పరమాత్మ కల్యాణమండపంమీద అవతరించినట్లు గోచరించి భక్తులు ఆనందబాష్పాలు విడిచేరు. స్వామివారికి ఉబ్బసంవ్యాధి ఉండటంవల్ల కాబోలు, ఆయన ఒకగంట ఉపన్యాసం యిచ్చేసరికి ఆయాసం వచ్చింది. అందుచేత అంతటితో ఆ రోజుకు సభ ముగింపు చేసి సభకు విచ్చేసిన పుణ్యాత్ములందరికీ స్వయంగా తులసతీర్థం యిచ్చారు.

నిరాటంకంగా ఉపన్యాసాలతో గడిచిపోయాయి మూడురోజులు. అతి సులభంగా మోక్షాన్ని సాధించే కిటుకు లెన్నిటినో నేర్చుకున్నారు భక్తులు.

నాలుగోరోజు శుక్రవారం. ఆరోజు ప్రత్యేకంగా స్త్రీలుమాత్రం స్వామివారి దగ్గర తులసితీర్థం తీసుకుందికి నిర్ణయింపబడింది. శిష్యులు పెద్ద కాగునిండా నీళ్లు తోడి కల్యాణమండపంమీద స్వామివారికి అంగుకొచ్చేలాగా కుడిచేతివైపు పెట్టేరు. స్వామివారు స్వయంగా ఆవరణలోఉన్న నాలుగు తులసిమొక్కల్లో...ఏసి కాగులో వేసి ఆ నీటిని పవిత్రంచేశారు. స్త్రీలంతా ఒకరి తరువాత ఒకరు ఉత్తరద్వారంగుండా ఆలయం ప్రవేశించి, తమ పేరు చెప్పి, భర్తపేరు ఉచ్చరిస్తూ తులసితీర్థం సేవించి, దక్షిణద్వారంగుండా వెళ్లిపోవాలి — అదీ, ఏర్పాటు! ఉత్తరద్వారం దగ్గర ఉన్న స్వామివారి శిష్యులు ఒక్కొక్కళ్లనే లోపల ప్రవేశపెడుతున్నారు. రమారమి ఏభైమంది తీర్థంతీసుకుని లరించి వెళ్లిపోయారు. తరువాత యిరవై సంవత్సరాల అమ్మాయి స్వామివారి సన్నిధికి వచ్చి

తన పేరు చెప్పింది తులసితీర్థం కోసం చెయ్యి చాచి, భర్త పేరు ఉచ్చరించింది, సిగ్గుపడుతూనే స్వామివారు ఉద్ధరిణతో తులసితీర్థం తీసి, ఆ అమ్మాయిని నఖశిఖ పర్యంతం ఒకసారి పరీక్షించి, చేతులో ఉన్న ఉద్ధరిణను జారవిడిచారు ఆమె ముఖంలోకి నిదానించి చూసి కన్నుమడిచి చిరునవ్వు నవ్వేరు ఆ అమ్మాయికి శరీరం నిండా తేళ్లూ జెర్రులూ ప్రాకినట్లయింది ముఖం చిట్లించి గిరుక్కున ఉత్తరద్వారం గుండా పరుగెత్తుకుని వచ్చేసింది అక్కడ తులసితీర్థానికి యింకా నిరీక్షిస్తున్నవాళ్లంతా 'ఏమిటేమిటి?' అన్నారు, ఆ అమ్మాయి గాభరాగా చూసి వెక్కుతూ, వెక్కుతూ ఆ అమ్మాయి జరిగిన విషయాన్నంతా పూసగుచ్చినట్లు చెప్పేసింది

స్వామివారు కాంతం అనే అమ్మాయిని అవమానపరిచేరు అన్న విషయం సాయంత్రానికి ఊరంతా అల్లుకుపోయింది 'అలా చేస్తారా, స్వామి?' అనుకున్నారు కొంతమంది పెద్దమనుష్యులు 'వాడిపని పట్టం చాలి' అన్నారు కొందరు గడీలు నీవైనా నిలకడగా యీ విషయం అంతు తేల్చుకోవాలి అనుకున్నారు అంతా కలిసి మహూర్తం మర్నాటికి వాయిదా వెయ్యబడింది

* * *

శనివారం మధ్యాహ్నం స్వామివారు ఉపన్యాసవేదిక ఎక్కేసరికి సభలో చాలా మార్పు కనిపించింది సభ ప్రతిరోజూకన్న కిటకిటలాడుతూంది ఒక్కొక్క పందిరి దగ్గర యిద్దరేసి ముష్కరులు చేవకర్రలు చేత పుచ్చుకుని నించున్నారు సభలో ప్రతిరోజూ ఉండే నిశ్శబ్దం లేదు స్వామి ఎంతో లోకజ్ఞానం కలిగిన మేధావి కనుకనూ, యింతకుముందు ఎన్నో ఢక్కామొక్కీలు తినివుండడం చేతనూ విషయాన్ని అవలీలగా పసికట్టగలిగారు సావకాశంగా కూర్చుని సహజమైన గంభీరస్వరంతో అడిగారు, సభికుల నుద్దేశించి, 'మీరంతా నన్ను శిక్షించాలనుకుంటున్నారు కదూ?'

సభలో కోలాహలం అంతరించింది కాని ఎవ్వరూ ఆ ప్రశ్నకు జవాబు చెప్పలేదు

స్వామివారు మళ్ళీ చెప్పడం మొదలుపెట్టారు 'నాకు తెలుసు అంతా తెలుసు నిన్న ఒక యువతిని చూసి నవ్వినందుకు మీరు నామీద పగపట్టేరు అమాయకులు! మిమ్మల్ని అనవలసిన పనిలేదు నవ్వినందుకు తగినంత కారణం ఉంది నిజానికి కాని, ఆ అమ్మాయి యీ సభలో ఉంటే నేనేమీ చెప్పదలచుకోలేదు'

'కారణం చెప్పండి ఆ అమ్మాయి సభలో లేదు' అన్నిమూలల్నుంచి అందరూ అరిచారు

స్వామివారు ప్రసన్నతతో బదులు చెప్పారు 'అంత అందమైనపిల్లకు యింత లేతప్రాయంలోనే వైధవ్యం ప్రాప్తిస్తుందంటే చలా విచారించవలసిన విషయం మాబోటి సన్యాసులు విచారించకూడదు గనుక నవ్వేను అంతే!' ఆయన మరేమీ మాట్లాడలేదు, ఆ రోజు ఉపన్యాసం యివ్వనూ లేదు అక్కడనుండి లేచి వెళ్ళిపోయారు

ప్రజాసమూహంలో తర్జనభర్జన లెక్కువయాయి స్వామి చెప్పినవిషయం యెంతవరకూ నిజమో కనుక్కోవాలనుకున్నారు విషయం తెలుసుకుని రావడానికి ఒకణ్ణి రాత్రికి రాత్రే ప్రయాణం కట్టి పంపేరు, ఆ అమ్మాయి భర్త కృష్ణమూర్తి ఉంటూన్న కైకరానికి కైకరం చెన్నూరికి సమీపంలోనే ఉంది

ప్రయాణమై వెళ్లినవాడు తెల్లవారేసరికి తిరిగి వచ్చాడు తను వెళ్ళేసరికి కృష్ణమూర్తి మరణావస్థలో ఉన్నాడనీ మరో గంటకల్లా ప్రాణాలు పోయేయనీ చెప్పాడు ఈ వార్త విన్నాక స్వామివారి ఘనత, గ్రామస్థులకి పూర్తిగా అర్థమయింది ఎలా ఉన్నవాళ్ళలాగే వెళ్ళి స్వామివారి పాదాలమీద పడిపోయారు

తమ తొందరపాటుతనాన్ని క్షమించమన్నారు, అపరాధాన్ని మన్నించమన్నారు శాంతంగా మందలించి, స్వామివారు వాళ్ళందర్నీ మన్నించారు కాని, ఆ వూరినుండి మాత్రం వెంటనే ప్రయాణం కట్టేరు, ముందు మజిలీకి ప్రయాణమవుతూన్న స్వామివారిని తొమ్మిదిరోజులూ పూర్తిగా ఉండి మరీ వెళ్ళమని భక్తులు కాళ్ళావేళ్ళా పడ్డారు ఆయన వాళ్ళందరికీ చెప్పినసమాధానం ఒక్కటే! 'ఇంత అనుమానస్థులు కల ఊళ్ళో ఒక్క క్షణం కూడా ఉండను'

తక్షణమే స్వామివారు తమ శిష్యగణంతోనూ, జంతుసముదాయంతోనూ, పరిచారకులతోనూ ముందు మజలీకి తరలిపోయ్యారు

* * *

స్వామివారు వెళ్లిన రెండురోజులకి చెన్నూరులో ఒక విషయం తెలిసింది అది విన్నవాళ్లంత ఆశ్చర్యంతో స్తబ్దులైపోయారు చెన్నూరు వచ్చుముందు స్వామి కైకరంలోనే మజిలీ చేశారట! అప్పటికే కృష్ణమూర్తి చావుబ్రతుకుల్లో ఉన్నాట్ట! చావుబ్రతుకులలో ఉన్న కృష్ణమూర్తి భార్య కాంతం అని తెలుసుకుందుకు స్వామికి ఎంతో కాలం పట్టి ఉండదు — ఈ విషయాన్ని కైకరం గ్రామంనుంచి వచ్చిన ఒక చౌదరిగారు తెలియపరిచేరు ఆయనే మరొక విషయం కూడా చెప్పేరు

'మునసబు రామయ్యనాయుడుగార్ని ఎరుగుదురా? ఆయన భార్యనొకసారి యిలాగే అవమానపరిచాడీ స్వామి అప్పట్లో నిన్నటి వరకూ యీ విషయాన్ని [illegible] పోయింది స్వామివారి [illegible] యీరోజు తేల్చుకుందామని, నిన్న సాయంత్రమే రామయ్యనాయుడు కూడా బయలుదేరాడు, కర్ర పుచ్చుకుని బహుశా యీ పాటికి అటోయిటో తేల్చుకుని ఉంటాడు'

మరో గంటకల్లా రామయ్యనాయుడు చేతులో కర్రతో అక్కడ ప్రత్యక్షమయాడు మనిషి బాగా అలిసిపోయినట్లు కనిపిస్తున్నాడు

'ఏం జరిగిందోయ్!' రామయ్యనాయుణ్ణి చూసి అడిగారు చౌదరిగారు

'ఏం జరుగుతుంది? స్వామికి కపాలమోక్షం జరిగిపోయింది' అన్నాడు రామయ్యనాయుడు ఎగరొప్పుతూ

'ఎంత ఘనకార్యం చేసుకున్నావో!' అన్నమాటలు [illegible] ఉన్న [illegible] వెంగడి నోటంట అప్రయత్నంగా [illegible] పడ్డాయి





Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras

# తెలుగుమెఱుగులు

గ్రంథకర్త **వేటూరి ప్రభాకరశాస్త్రిగారు**

తెలుగుదనము, తెలుగుసంప్రదాయాలు, తెలుగుభాష అవతరించిన విధము, తెలుగు తేటదనము, తెలుగు కవితాపారమ్యము, ప్రాచీన గ్రంథాల పలుకుబడికి మనపై చెల్లుబడి, విలక్షణమైన మన అరసున్న చరిత్ర, వింత వింత నిఘంటువులు, మన గ్రంథాలలో గ్రంథులు, అవీ ఇవీ, ఇంకా తెలుగులో ఉన్న ఎన్నో మెఱుగులను చూపెట్టుచున్న వ్యాసముల సంపుటి శాస్త్రిగారి పాతిక ముప్ఫయి సంవత్సరాల సాహిత్య కృషి ఇందులో మూర్తీభవించియున్నది ఆంధ్రాభిమానముగలవారందరు అవశ్యము చదువవలసిన గ్రంథము ప్రతులకు త్వరపడవలెను

**వెల ౨ రూ.**

**తపాలాఖర్చులు ౮ అణాలు**

---

# ఆంధ్రగ్రంథమాల

**పోస్టుబాక్సు నెం. 212, మదరాసు 1.**


RAJA SNOW
"RAJA" SNOW
Beauty & Complexion
MANUFACTURERS
MANYAM & CO.
MANYAM & CO


RAJA
HAIR OIL


RAJA
(REGD. T.M.)
Kasturi Soap
MANYAM & CO


RAJA
MANYAM & CO
RAJA